# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

78/79

ఏప్రిల్/మే 1978

1. ఆర్థిక ఇబ్బందుల వల్ల, అనివార్య కారణాల వల్ల సృజన ఏప్రిల్, మే సంచికలు కలిపి వేస్తున్నాం. ఏజంట్ల నుంచి రావలసిన బకాయిలు పేరుక పోతున్నాయి. ఎక్కడి కక్కడ పాఠకులే కదిలి ఈ బకాయిలను ఏజంట్లు వెంటనే చెల్లించేట్లు చేస్తే తప్ప సృజన నిర్వహణ కష్టసాధ్యమవుతుంది. అట్లే సృజన అభిమానులు అధిక సంఖ్యలో చందా దార్లను చేర్పిస్తే తప్ప సృజన ఏజంట్లను నమ్ముకొని బతకజాలదు.

2. ఇకనుంచైనా ప్రతినెలా ఒకటవ తేదీన సృజన పాఠకుల చేతుల్లో వుంచే ప్రయత్నాలు ఏజెంట్లు, చందాదార్లు సహకరిస్తేతప్ప నెరవేరవు.

3. మే డే సందర్భంగానూ, విరసం రాష్ట్ర మహాసభల సందర్భంగానూ ఈ సంచికను ఎక్కువ పేజీలతో విరసం పై చర్చను ప్రారంభిస్తూ తెస్తున్నాము.

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 15 ఈ సంచిక 2 రూపాయలు

# సృజన

ఏప్రిల్ / మే 1978 మాసపత్రిక 78/79



ఎస్.వి.ఎస్. రావు,రంగనాయకమ్మ, వేణుగోపాలరావు, పినాకపాణి, అల, కనక మేడల రవీంద్రకుమార్, కె.జి. కన్నభిరాన్ ఈ సారి చర్చల్లో పాల్గొన్నారు.


SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

చికాగో నగరంలో పనిగంటల పరిమితి కోసం సాగించిన పోరాటంలో కార్మి కుల రక్తంలో తడిసి ఎగిరిన ఎర్రజెండా ఈ మేడే నాడు జనతా 'ప్రజాస్వామ్య' ప్రభుత్వ కార్మికవర్గ 'పక్షపాతానికీ' స్త్రీలపై, బలహీనవర్గాలపై ఇందిరా కాంగ్రెస్ 'ప్రేమ'కూ సాక్ష్యంగా ఎన్నో కాల్పుల గాథలను, కన్నీటి బాధలను కళ్ళకు కడుతూ పీడిత ప్రజల పోరాట రక్తశ్వాసలతో ఎగురుతున్నది.

కాన్పూరు స్వదేశీ మిల్లు కార్మికులపై జనతా ప్రభుత్వం నిర్విచక్షణగా సాగించిన కాల్పులమోత ఇంకా చెవుల్లో భయంకర ఆర్తనాదాలను, కళ్ళముందు రక్తప్రవాహాలను స్మృతి నుంచి చెరపకముందే పంత్‌నగర్‌లో వందల సంఖ్యలో కార్మికులను కాల్చి వేసిన ఉదంతం హృదయాలను ఉద్విగ్నం చేస్తున్నది. ఆలోచనలను ఉడికెత్తిస్తున్నది. కార్మికులు న్యాయమైన హక్కులకోసం పోరాటంచేస్తున్న ప్రతిచోటా జనతా ప్రభుత్వం వాళ్ళపై లాఠీల, తూటాల ప్రజాస్వామ్యాన్ని అమలుచేస్తున్నది. రైల్వే కార్మికులను పారిశ్రామిక కార్మికులుగా గుర్తించి వారికి బోనస్ యివ్వాలని పోరాడి, కార్మిక పక్ష పాతిగా ఇందిరా నిరంకుశత్వాన్ని ఎదురించిన సోషలిస్టుపార్టీ ఇవ్వాళ రైల్వే కార్మికుల బోనస్ వగయిరా, న్యాయమైన కోర్కెలు అలావుంచి, కార్మికులపై జరుగుతున్న ఈ హత్యాకాండలో పొత్తుకూడింది. పీడిత ప్రజలపై పోలీసుల కాల్పులు జరగని ఒక్క రోజుకూడ జనతా ప్రభుత్వం నాలుగువందల రోజుల పాలనలో లేదంటే లేదు.

బోనస్ తగ్గిస్తూ ఎమర్జన్సీలో చట్టం చేయడం పొరపాటే అయిందని ఇవాళ మొసలి కన్నీరు కారుస్తున్న ఇందిర కార్మికవర్గ వ్యతిరేకత గురించి కొత్తగా చెప్ప వలసిందేమీ లేదు. హరిజన, గిరిజన, బలహీనవర్గాల పట్ల, స్త్రీలపట్ల ఇందిరా కాంగ్రెస్ ఒలకబోసిన అపారమైన సానుభూతికి చెన్నారెడ్డి ప్రభుత్వం కన్న సాక్ష్యం ఏంకావాలి ?

రాజధానీనగరం మూసీ ఒడ్డున పట్టపగలు పోలీసులు హరిజన యువకుణ్ణి హత్య చేసారు. రాజధానీ నగరం నడిబొడ్డున నల్లకుంటలో రాత్రిపూట రమేజాబీ అనే ముస్లిం స్త్రీని పోలీసులు మానభంగం చేసారు. ఆమె భర్తను చంపివేసారు. పోలీ సుల అత్యాచారాలను, హత్యాచారాలను ప్రశ్నించిన, ఎదురించిన వారనేకాదు, ఏ సంబంధమూ లేని ప్రజలను కూడ ఎందరినో హైదరాబాదు, వరంగల్, గోదావరిఖని, పరకాల మొదలైన చోట్ల తుపాకీ కాల్పులకు గురిచేసారు. ఈ పోలీసు కాల్పుల్లో

మరణించిన వారిలో అత్యధిక సంఖ్యాకులు కార్మికులు, నిరుపేద కార్మికులు, బీడీకార్ఖానాల్లో పనిచేసేవాళ్ళు, అమాలీలు, రెక్కల కష్టంచేసే ముస్లిములు.

రిక్షా కార్మికులకు, పేద ప్రజలకు వానకోట్లు దానంచేసే వెండితెర నాయకుడు ఎం. జి. రాంచంద్రన్ మాత్రం ఏం తక్కువ తిన్నాడు. తమ న్యాయమైన కోర్కెలకై ఆందోళన చేసిన వ్యవసాయ కార్మికులపై పోలీసు కాల్పులు జరిపించాడు.

ఇదే తమిళనాడు నుంచి ఉత్తరప్రదేశ్ దాకా కార్మికుల బలిదానాల చరిత్ర. అయితే కార్మికులు, పీడితులు చేతులు కట్టుకొని కూచోడంలేదు. ప్రతి పోరాటాన్నీ మిలిటెంట్ స్వభావంతో నిర్వహిస్తున్నారు. ఏ సమస్యకూ పాలకవర్గాల వద్ద తుపాకులు తప్ప పరిష్కారాలు అందుబాటులో లేవు.

కార్మికుల రక్తంలో తడిసి ఎగిరిన ఎర్రజండానే కమ్యూనిస్టు పార్టీ జెండాగా సుత్తె-కొడవలి చిహ్నాలతో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం స్వీకరించింది. కార్మికుల పోరాటాలకు కార్మికవర్గ నాయకత్వాన్నిచ్చింది. ప్రజా పోరాటాలకు నాయకత్వం వహించి దిశనూ, గమ్యాన్నీ నిర్దేశించింది.

ఈ మేడే మనదేశంలోని కార్మికవర్గ నాయకత్వానికి ఆ కర్తవ్యాన్ని గుర్తుచేస్తున్నది. కార్మిక, కర్షక విప్లవకర శక్తుల్లో, లక్షలాది మంది నిరుద్యోగుల్లో కదిలిస్తే చాలు, అగ్గిపుల్ల గీకితే భగ్గుమండే పెట్రోల్‌లా పెల్లుబుకుతున్న ఆగ్రహావేశాలకు ఒక సంఘటన, ఒక సిద్ధాంతం, ఒక క్రమశిక్షణ- విప్లవ నిర్మాణానికి అనుగుణమైన ప్రణాళికతో రూపొందించి నాయకత్వం వహించి నిర్వహించ వలసిన బాధ్యత ఏనాటి కన్న ఈనాడు కార్మికవర్గ నాయకత్వంపై మరింత వుందని ఈ దేశంలో రోజూ కార్మికుల రక్తంలో తడిసి ఎగురుతున్న మేడే పోరాటజెండా హెచ్చరిస్తున్నది. ఈ నెత్తుటి నిజాలనుంచి పాఠాలు తీసుకోకపోతే చరిత్ర మనల్ని క్షమించదు.

— సంపాదకుడు

---

సృజన పాఠకులకు, ఏజెంట్లకు, అభిమానులకు

## మేడే విప్లవాభినందనలు

— 'సాహితీ మిత్రులు'

# ప్రజలే చరిత్ర నిర్మాతలు

చరిత్ర నిర్మాత లెవరు? వీరులా? బానిసలా? భావ, భౌతిక వాదాలకు చరిత్ర వ్యాఖ్యానం గురించి ఏనాటినుంచో జరుగుతున్న సంఘర్షణలో తేలకుండా మిగిలిపోయిన ప్రశ్నలివి.

దోపిడీవర్గాలు, తమ పాలన కొనసాగించుకునేందుకు, వేలాది ఏళ్ళ నుంచి వీరులే చరిత్ర నిర్మాతలంటూ భావవాద దృష్టిని ప్రచారం చేస్తున్నారు. దోపిడీవర్గాల కొమ్ముకాసే కొద్దిమంది కథానాయకులే మేధావులనీ, అదే దైవనిర్ణయమనీ, వాళ్లే చరిత్ర నిర్మాతలనీ చెబుతున్నారు. జనం ఉత్త గొర్రెలమంద అని, మందబుద్ధులని, వారు కథానాయకుల కనుసన్నలలో మెలగవలసిన వారేనని కూడా అంటున్నారు.

ఈ లెక్క ప్రకారం చూస్తే, దోపిడీవర్గాల పెత్తనం కొనసాగినప్పుడు చారిత్రిక అభివృద్ధి కొద్దిమంది పాలకుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి వుంటుంది. సామాన్య జనం వాళ్ళకు లొంగిపోయి తూర్పుకు తిరిగి దణ్ణంపెట్టి ఎవడోవచ్చి ఏదోచేసి తమను కాపాడుతాడని కలలుకంటూ కూర్చోవలసిందే. ఇలాంటి భావవాద దృష్టి కష్టజీవులకు ఆధ్యాత్మిక గుదిబండ.

## కొత్త చరిత్ర

మానవజాతి చారిత్రిక అభివృద్ధిని నిర్ణయించే సామాజిక సూత్రాలను మొట్ట మొదటి సారిగా మార్క్సిజమే వెలుగులోకి తీసుకువచ్చింది. అలగా జనమే చరిత్ర నిర్ణయిస్తారని శాస్త్రీయంగా రుజువుచేసింది. దోపిడీవర్గాలను తారుమారుచేసి చరిత్రను మార్క్సిజమే నిటారుగా నిలబెట్టి భావవాద దృష్టిలోని దివాళాకోరు తనాన్ని బట్టబయలు చేసింది. అంతేకాదు, దోపిడీవర్గాల పాలన వేలాది ఏళ్ళుగా కొనసాగుతూంది. ఆ పాలనకు సిద్ధాంత పునాది వుంది. ఆ పునాదిని పెకలించి వేసింది మార్క్సిజమే. చైనా విప్లవం నడిపేప్పుడు మావో, పార్టీ సభ్యులకు, ప్రజలకు కూడా భౌతికవాద దృష్టి నూరిపోశాడు. ప్రజలే చరిత్ర నిర్మాతలన్నదే ఆ దృష్టి. అదే సమయంలో చారి త్రిక భావవాదానికి వ్యతిరేకంగా అతను ఎడతెగని పోరాటం సాగించాడు. పార్టీకి ప్రజాపంథాను రూపొందించడమే గాక మావో ఏమన్నాడంటే "జనం అపారమైన సృజనాత్మక శక్తి కలవారు. మనం జనాన్ని నమ్మాలి. పార్టీని నమ్మాలి. ప్రజలే నిజమైన వీరులు. మనమే ఏమీ తెలియనివాళ్ళం. కళ్ళుతెరవని వాళ్ళం." ఇలాంటి సూక్తులన్నీ కూడా భావ వాద చారిత్రిక దృష్టిని గట్టి దెబ్బతీశాయి. బానిస యజమా

నులు, భూస్వాములు, పెట్టుబడిదారులు అందరు కలిసి ప్రజలే చరిత్ర నిర్మాతలనే నిజాన్ని నొక్కివేయాలని చూశారు.

దోపిడీవర్గాలు తమంత తాముగా ఎన్నడూ గద్దె దిగవు. వాళ్ళ పాలన కూలిపోయాక కూడా తమ పాడు సిద్ధాంతాలను ఒక పట్టాన వదులుకోరు. లీషావ్‌చీ మొదలైన దివాళాకోరు రాజకీయ వాదులు భావవాద జాలంలో పడిపోయారు. కథానాయకులే చరిత్ర నిర్మాతలని ప్రచారం చేశారు. ఈ ప్రచారమే, చైనా సోషలిస్టు విప్లవంలో రెండు వర్గాలకు, రెండు పంథాలకు జరిగిన పోరాటంలో విన్పించింది. ఈ తప్పుడు సిద్ధాంతాన్ని మనం గట్టిగా తూర్పారబట్టేసరికి ఈ దివాళాకోరు రాజకీయవాదులే "చరిత్రను కథానాయకులు ప్రజలు కలిసి నిర్మిస్తారని" కొత్తరాగం మొదలెట్టారు. మార్క్సిస్టు మూలసూత్రాన్ని ద్వైదీభావం కింద మార్చివేసి ఎందుకూ పనికిరాకుండా చేయాలని వీళ్ళు వ్యర్థప్రయత్నం చేస్తున్నారు.

తత్త్వశాస్త్రంలో ద్వైతం ఏం చెబుతుందంటే భావన, పదార్థం అనేవి రెండూ కూడా ప్రపంచంలో రెండు సూత్రాలు. లీషావ్‌చీ వగైరాలు ప్రచారంచేసిన సూత్రం "చరిత్రను కథానాయకులు, ప్రజలు కలిసి నిర్మిస్తారనేది" ఈ ద్వైతంలో భాగమే.

ఇంతకీ ఈ ద్వైత సిద్ధాంతం చరిత్రలో ప్రజల పాత్రను నిజంగా గుర్తిస్తుందా? ముమ్మాటికీ గుర్తించదు. లీషావ్‌చీ వగైరాల దృష్టిలో "మామూలు జనం షావుకార్లయి కులాసాగా కాలక్షేపం చేయాలని చూస్తారు." కూలీలంతా "వొళ్లుదాచుకొని ఎక్కువ డబ్బు గడించాలని చూస్తారు." వాళ్ల లెక్క ప్రకారం సామాన్యజనం అంటే ధనదాహంతో పరుగులెట్టే గొర్రెలమందే గాని చరిత్ర నిర్మాతలు కానేకారు. దోపిడీవర్గాల ప్రతినిధులు మాత్రం "ముందుచూపున్న దొడ్డవారు." కనక దేశం "ఆ దొడ్డవారివల్లనే మనగలుగుతుంది. మళ్లీ మళ్లీ పతనమయిన జాతిని వాళ్లే బ్రతికిస్తున్నారు." ఒకవంక మామూలు జనాన్ని తిట్టి దిగజారబోసి, మరోవంక దొడ్డ ప్రభువులను ఆకాశానికెత్తేసే వీళ్ల వైఖరిచూస్తే మనకు ఓ సంగతి కచ్చితంగా తెలుస్తుంది. "చరిత్రను కథానాయకులూ మామూలు జనం కలిసి నిర్మిస్తారనేది" తమ చారిత్రక భావవాదధోరణికి కేవలం ఓ ముసుగు మాత్రమే.

సామాన్యజనం చరిత్ర నిర్మాతలనే మాట ఒప్పుకోకపోతే, కథానాయకులే చరిత్ర నిర్మాతలని నువ్వు చెబుతున్నట్టే. కాని లీషావ్‌చీ వగయిరాలు "కథానాయకులు, సామాన్యజనం కలిసి చరిత్ర నిర్మిస్తారనే" సిద్ధాంతాన్ని బాకా ఊదడం ద్వారా రెండు

పరస్పర వ్యతిరేక వాదాలను నిష్పాక్షికంగా సమన్వయం చేయడానికి కృషిచేస్తున్నట్లు కన్పిస్తారు. కాని రాజకీయ దివాళాకోరులు అవలంబించే కుతర్కం యిది.

ఆదిమ సమాజం అంతరించి పోయినాక ఎంగెల్సు చెప్పినట్లు చరిత్ర యావత్తూ వర్గ పోరాటాల చరిత్రే. "సామాజిక అభివృద్ధి వివిధ దశల్లో పీడితులు, పీడకులు, పనిచేసేవారు, పెత్తనం చేసేవారు నిరంతరం ఘర్షణపడ్డారు." సామాజిక భౌతిక అవసరాలను ఉత్పత్తి చేసే పద్ధతే చారిత్రిక అభివృద్ధికి భౌతిక ప్రాతిపదిక. అన్ని సమాజాల్లోనూ కూడా ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు జరిగే సంఘర్షణే ప్రధానమైనది. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి ఉత్పత్తి సంబంధాల్లో మార్పుతెస్తుంది. పాత ఉత్పత్తి పద్ధతి పోయి కొత్త ఉత్పత్తి పద్ధతి వస్తుంది. ప్రాథమిక సామాజిక వ్యవస్థ పోయి, ఉన్నత సామాజిక వ్యవస్థ వస్తుంది.

"ఉత్పత్తి శక్తు లన్నింటిలోకీ గొప్పది విప్లవ వర్గమే" అన్నాడు మార్క్సు. వర్గసమాజంలో ఉత్పత్తి శక్తులకు ఉత్పత్తిసంబంధాలకు మధ్య సంఘర్షణ జరుగుతుంది. సామాజిక ఉత్పత్తి శక్తులను పెంపొందించాలనే విప్లవ వర్గాలకు, పాత ఉత్పత్తి సంబంధాలను అలాగే అట్టిపెట్టాలని చూసే విప్లవ ప్రతిఘాతకులకు జరిగే ఈ వర్గ సంఘర్షణలో ప్రజలే నిర్ణయాత్మక శక్తి. సామాజిక మార్పులన్నీ ప్రజల విప్లవ పోరాటాల వల్లనే జరుగుతాయి. పురోగామి ఆలోచనలు, సిద్ధాంతాలు అన్నీ కూడా ఈ పోరాటాల ఫలితమే. ప్రజల విప్లవ పోరాటాల ప్రతిబింబమే; శాస్త్రీయ సాంకేతిక పురోభివృద్ధి అంతా ప్రజల ఆచరణ, అనుభవాల జోడింపే; అభ్యుదయ సంస్కృతి, కళలు అన్నీ కూడా ప్రజల జీవితం నుంచి, ప్రజాపోరాటాల నుంచీ పుట్టేవే. ఉత్పత్తికోసం ప్రజలు పోరాడకపోతే అసలు సమాజమేలేదు- చరిత్ర ముందుకు పోదు. వర్గ సమాజంలో ప్రజల వర్గపోరాటాలు లేనిదే చారిత్రిక అభివృద్ధి గుండుసున్న. "కేవలం ప్రజలే చరిత్ర చోదకశక్తి" ఇది తిరుగులేని సత్యం.

## వీరుల పాత్ర

అలాంటప్పుడు వీరుల పాత్రపట్ల మన దృక్పథం ఎలా వుండాలి? చారిత్రిక భౌతికవాదం వాళ్ల పాత్రను తీసిపారేస్తుందా? లేదు. వాళ్ల పాత్ర గొప్పదని ఒప్పుకుంటుంది. ఉన్న చిక్కల్లా ఒక్కటే- వీరులంటే ఏమిటి? సరయిన వెలుగులో వాళ్ల పాత్రను ఎలా మదింపువేయాలి? వీరుల పాత్రకు, చరిత్ర నిర్మాతలైన ప్రజలపాత్రకు వున్న సంబంధ బాంధవ్యాల పట్ల మన వైఖరి ఎలావుండాలి? లీషావ్‌చీ వగయిరాలతో మనం భేదించేదీ, మనం బాగా తగాదాపడేదీ కూడా ఈ ప్రశ్నల దగ్గరే.

వర్గసమాజంలో వీరుల స్వభావం వారి వర్గాలను బట్టి వుంటుంది. వర్గాలకు అతీతంగా వీరులుండరు. ప్రతి వర్గానికీ వీరులగురించి తనదైన ఒక దృష్టి వుంటుంది. శ్రామిక వర్గానికి, కష్టజీవులకు వీరులు ప్రజల విప్లవ పోరాటాల్లోనుంచి పుడతారు. ఆ వీరులే ప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తారు, చరిత్ర గమనానికి తోడ్పడతారు. ప్రజలే చరిత్రనిర్మాతలన్నమాట నిజం కనక వీరుల పుట్టుక అలాగే వుంటుంది. దోపిడీవర్గాల వైఖరి దీనికి భిన్నమయినది. వాళ్ల ప్రయోజనాలను కాపాడి, దోపిడీ వ్యవస్థను పదిలంగా వుంచగలిగే వారే వీరులని వాళ్లంటారు. దోపిడీ పాలకవర్గాలు ప్రజావీరులను ఎన్నటికీ గుర్తించరు. అలాగే శ్రామికజనం దోపిడీ పాలకవర్గాల కొమ్ముకాసే వీరులను కొలవరు. ఉదాహరణకు ఆధునిక చైనా చరిత్రలో హుంగ్ హే చిన్. విప్లవోద్యమానికి నాయకుడు. సామ్రాజ్యవాద దురాక్రమణకు, భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా పోరాడిన ధీరుడతడు. అతడే ప్రజావీరుడు. కాని దోపిడీ పాలకవర్గాలు అతన్ని దేశద్రోహి కింద జమకట్టారు. అంతేగాకుండా ఈ పాలక వర్గాలు యాంగ్‌కుషాన్‌ను వీరుడని కొనియాడుతారు. తైఫాంగ్ విప్లవోద్యమాన్ని అణచింది ఇతగాడే. శ్రామికవర్గాలు అతగాడిని దోపిడీవర్గాల తొత్తని, దేశద్రోహని ఖండిస్తాయి.

మావో అన్నట్టు "ప్రజలకోసం ప్రాణం ఇవ్వడమనేది తాయ్ శిఖరంకన్న ఉన్నతమయినది. కాని ఫాసిస్టులకోసం దోపిడీగాళ్లకోసం దొరలకోసం ప్రాణం యివ్వడమనేది గడ్డిపోచకన్నా హీనమయినది." పీడకవర్గాల, పీడితవర్గాల ప్రయోజనాలమధ్య వున్న ప్రధాన విభేదమే వీరులపాత్ర గురించిన దృష్టి భేదానికి కారణం. పీడకవర్గానికి ఆటుపోటు లుంటాయి; వివిధ చారిత్రిక దశల్లో దాని స్థానం మారుతూ వుంటుంది. అలాగే దాని కొమ్ముకాసే వీరులపాత్ర అన్ని దశల్లో ఒకే మోస్తరుగా వుండదు.

వీరులు శూన్యంలోంచి పుట్టరు; చారిత్రక అభివృద్ధి నుంచి, వర్గ పోరాటం నుంచే వారు పుడతారు. మార్క్సు చెప్పాడు: "ప్రతి సామాజిక దశకు దాని మహనీయులు కావాలి, ఒకవేళ అలాంటి మహనీయులు ఎక్కడా కనిపించకపోతే వాళ్లను సమాజమే సృష్టిస్తుంది." ఈ శాస్త్రీయ సిద్ధాంతాన్ని చరిత్ర రుజువు చేసింది. ప్రాచీన చరిత్రలో రోమ్ సామ్రాజ్యపు రోజుల్లో స్పార్టకస్‌ను గొప్ప వీరుడిగా కొనియాడాడు మార్క్స్. స్పార్టకస్ మామూలు బానిసగానే పుట్టాడు. ఆనాటి బానిసల తిరుగుబాట్లే అతన్ని వీరుడిగా మలిచాయి. అతని నాయకత్వంకిందే బానిస వ్యవస్థను గట్టి దెబ్బ

తీసారు. చైనాలో ఛిన్ వంశం వారి రోజుల్లో ఛెన్ షెంగ్ వూకాంగ్ యిద్దరూ కూడా మామూలు రైతు కుటుంబం నుంచి వచ్చినవాళ్లే, కాని పెచ్చుపెరిగిన వర్గవైరుధ్యాలు, రైతుల తిరుగుబాట్లు వాళ్లను ఉద్యమ నాయకులుగా తయారుచేశాయి.

బూర్జువా విప్లవాల్లోకూడా కొందరు నాయకులు సామాన్య జనం నుంచే వస్తారు. ఫ్రెంచి విప్లవంలో గొప్ప సేనానులు చాలా మంది అంతకుముందు మామూలువాళ్లే- మంగళ్లు, అద్దకం పనివాళ్లు, చిల్లరమల్లర అమ్మకంగాళ్లు వీళ్లందరినీ అంతకుముందు చాలా హీనంగా చూసేవారు. విప్లవం రానిదే అంత తక్కువ వాళ్లు అంత మంచి సేనానులెలా అవగలరు? "నిజమైన విప్లవం యొక్క గుర్తేమిటంటే ఇబ్బడిముబ్బడిగా పాటక జనం పీడిత ప్రజలు రంగంమీదకు రయిరయిమని ఉరకడమే" నన్నాడు లెనిన్. శ్రామిక విప్లవంలో ఈ మాట మరింత నిజం. వివిధ దశల్లో ప్రజా పోరాటాలకు ముందు నిలబడి ప్రజల ప్రయోజనాలు తీర్చగలిగిన వారే నిజమైన వీరులు. చరిత్ర ప్రతిసారీ నూతన కర్తవ్యాలు నిర్దేశిస్తుంది. ప్రజలకు నాయకత్వంవహించే వీరులు పుట్టితీరతారు.

## వీరులు ప్రజల నుంచే పుడతారు

విప్లవ వర్గాలకు, అభివృద్ధి శక్తులకు ప్రాతినిధ్యం వహించి, ప్రజల అవసరాలు పసిగట్టి వాళ్ల మద్దతు సంపాదించడం వల్లనే వీరులు చరిత్రలో ముఖ్యమైన పాత్ర నిర్వహించ గలుగుతారని మార్క్సిజం చెబుతుంది. వీరుడైనా, ధీరుడైనా ఎవడయినా సరే ప్రజల నుంచే బలం సంపాదించుకుంటాడు. ప్రజల ప్రయోజనాలను ప్రతిబింబించలేని వాడు ఎందుకూ కొరగాడు. మానవుడి సామాజిక స్థితే అతని ఆలోచనను నిర్ణయిస్తుంది. విప్లవ వర్గాల తాలూకు సరయిన ఆలోచనలు జనం బాగా వంటబట్టించుకుంటే అవి భౌతిక శక్తులంత బలంగా పనిచేస్తాయి.

వీరుడు పురోగామివర్గం కొమ్ముకాయాలి. సామాజిక అభివృద్ధిలో సూత్రాలు, సమాజాన్ని ప్రపంచాన్ని మార్చే విప్లవకార్యాచరణ వీటన్నిటినీ వీరులు కొనసాగించాలి. ఇదే కీలకమైన సంగతి. "వీరులు, ప్రజలు కలిసి చరిత్ర నిర్మిస్తార"ని చెప్పే దొంగ మాట వర్గప్రయోజనాలను దాటవేస్తుంది. విప్లవవర్గాన్ని, విప్లవ ప్రతిఘాతవర్గాన్ని ఏకం చేయడానికే ఈ భావవాద కుతర్కం ప్రయత్నిస్తుంది.

శ్రామికవర్గాల, విప్లవ ప్రజల వీరులే విప్లవ భావాలను వెదజల్లుతారు. వారే విప్లవ భావాలను కొనసాగిస్తారు. మామూలు జనంకన్నా వారు మరింత దూరదృష్టి కలిగి వుంటారు. వాళ్లు చాకచక్యంగా జనాన్ని సమీకరించ గలుగుతున్నారా లేదా అనేది పోరాటాల జయాపజయాలమీదే ఆధారపడి వుంటుంది. అన్ని అవకాశాలు, పరిస్థితులు వుండి కూడా కేవలం నాయకత్వం లోపంవల్ల చరిత్రలో చాలాసార్లు పోరాటాలు అపజయం పొందాయి. దీన్నిబట్టి చూస్తే వీరులు కొంతవరకు పోరాటాలను తుంచగలరు, పెంచగలరు అనిపిస్తుంది. అయితే, వీరులు వేగాన్ని పెంపొందించ

గలరే గాని చరిత్రగతిని మార్చలేరు. విప్లవ పోరాటాల నుంచే వీరులు పుడతారు- ప్రజలను అంటిపెట్టుకు ఉన్నంతవరకే వాళ్ళు తమ పాత్ర నిర్వహించగలుగుతారు పురోగామి భావాలు సిద్ధాంతాలు అనేవి ప్రజల విప్లవ ప్రయోజనాలకు ప్రతిబింబమే. ప్రజల పోరాటానుభవాల పొందికయే. వాటిని ప్రజలు పూర్తిగా వంటబట్టించుకున్న పుడే అవి భౌతిక శక్తిగా రూపొందుతాయి.

"చారిత్రక భావవాదపు దివాళాకోరుతనం" అన్న తన వ్యాసంలో మావో చాలా నిశితంగా చెప్పారు. "చైనాలో పరిస్థితులు అనుకూలంగా వున్నందువల్లనే మార్క్సిజం-లెనినిజం అక్కడ గట్టిగా కాలూనగలిగింది. చైనా ప్రజల విప్లవ కార్యాచరణతో అది గట్టిగా ముడిపడివుంది. చైనా ప్రజలు దాన్ని ఆకళింపు చేసుకున్నారు. ఏ సిద్ధాంతం అయినాసరే, చివరకు మార్క్సిజం-లెనినిజం అయినా సరే వాస్తవ పరిస్థితులతో ముడిపడి ఆ అవసరాలు తీర్చగలిగి, ప్రజలు ఆకళింపు చేసుకోగలిగితేనే ప్రయోజనం- లేపోతే దండగ. మనం చారిత్రిక భౌతికవాదులం, భావవాదులం కాదు." మావో మాటలు చారిత్రిక భావవాదాన్ని తుత్తునియలు చేశాయి.

మొట్టమొదట విప్లవంలో పాల్గొని బాగా పేరుపొందిన వీరులు చరిత్రలో చాలా మంది వున్నారు- కాని తరువాత వాళ్ళు ప్రజలకు దూరమయి ఓడిపోయారు. జనం వాళ్ళనెప్పుడూ తలవరు కూడా.

బూర్జువా విప్లవకారుల్లో అలాంటివాళ్ళు మరీ చాలామంది వున్నారు. ఫ్రెంచి విప్లవమప్పుడు రాబర్ట్‌పెరి బాగా వెలుగులోకి వచ్చాడు. విప్లవం తొలిరోజుల్లో ప్రజల అవసరాలు తీర్చడానికి కొంత పాటుబడ్డాడు. అందువల్ల ప్రజల మద్దత్తు వారికి లభించింది. అందుకే లూయీ రాజును వాళ్లు ఉరికోత కోయగలిగారు. కాని రాబర్ట్‌పెరి బూర్జువా విప్లవకారుడు మాత్రమే. విప్లవం విజయం పొందగానే అతను జనాన్ని ఖాతరుచేయడం మానేశాడు. అంతేగాదు- వాళ్లను అణగదొక్కాడు. అందువల్ల అతను ప్రజల మద్దత్తు కోల్పోయి చివరకు విప్లవ ప్రతిఘాతకులను ఎదిరించలేకపోయాడు. చివరకు విప్లవ ప్రతిఘాతకులచేతుల్లో తానే బలయిపోయాడు. అలాగే చాంగ్‌తైయేన్. 1911 చైనా విప్లవంలో అతన్ని ఎన్నోసార్లు వేటాడారు. మూడుసార్లు జైల్లో పెట్టారు. అయినా అతని ఉత్సాహం చల్లారలేదు. కొంతకాలం అతను గొప్ప పాత్ర నిర్వహించాడు. ప్రజల్లో మంచి పలుకుబడికూడా వుండేది. కాని విప్లవం తరువాత సమాజానికీ, జనానికీ దూరమయిపోయి విప్లవ చేవ చచ్చిపోయి, కాలగర్భంలో కలిసిపోయాడు. జనం అతన్ని సాంతం మర్చిపోయారు.

బూర్జువా విప్లవకారుల ఈ లక్షణం వారి వర్గస్వభావం బట్టి నిర్ణయమవుతోంది. భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా ఇద్దరూ కలిసి పోరాడేప్పుడు కూడా బూర్జువాలకు కష్టజీవులకు మధ్య ఎంతో తేడా వుండేది. విప్లవం జరుగుతున్న కాలంలో బూర్జువాలు

వాళ్ల వర్గప్రయోజనాలకే పరిమితం అయ్యేవారు. జనాన్ని చూసి బెదిరేవారు, ఊగిసలాడేవారు, శత్రువుని బుజ్జగించేవారు, జనాన్ని దగా చేసేవారు. ప్రజలతో వారి శత్రుత్వం చాలా ప్రధానమైనట్టిది- రాజకీయాధికారం వాళ్ల గుంజుకున్నాక ఇది మరింత తేటతెల్లమయింది. అందుకనే 18, 19 శతాబ్దాల్లో బూర్జువా ప్రతినిధులు విప్లవాలు నడిపినా, జనం అందులో బలమైన శక్తులుగా వున్నారు.

బూర్జువా ప్రజాస్వామ్య విప్లవంలో తాత్కాలికంగా నయినా వారి ఆశయాలు నెరవేరాలంటే బూర్జువా నాయకులు ఏదోమేరకు జనంమీద ఆధారపడక తప్పదు. అలా కాకపోతే శత్రువు పరాజయం చెందదు. అలాగే శ్రామిక విప్లవంలో కూడా మొదట్లో మనకు చాలా మంది సాయపడతారు. విప్లవం ఒక దశకు చేరగానే ఆగిపోతారు- అంతేకాదు- రంగు మార్చేస్తారు కూడా. వీళ్ళు బూర్జువా విప్లవకారులు- బూర్జువా విప్లవనాయకులు ప్రజలకు, చరిత్ర ప్రవాహానికి, అభివృద్ధికి అడ్డుగోడలు. చరిత్ర ముందుకు పోవాలంటే ప్రజలు ఇలాంటి నాయకులను కూలదోయాలి.

ఇంతకీ చెప్పొచ్చేదేమంటే, చరిత్ర నిర్మాతలు వీరులుకాదు; చరిత్రే వీరులను తయారుచేస్తుంది. చరిత్రనిర్మాతలు ఉమ్మడిగా వీరులు, ప్రజలు కూడా కాదు. కేవలం ప్రజలు మాత్రమే చరిత్ర నిర్మాతలు.

## శ్రామికవర్గ నాయకుల పాత్ర

మానవజాతిలో పురోగామి విప్లవాత్మకవర్గానికి నాయకత్వం వహించేవారు శ్రామిక నేతలు. శ్రామిక నాయకులకు, ఇతరవర్గాల నాయకులకు ఉన్న పెద్ద తేడా ఇదే. కార్మికుల కష్టజీవుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తూ ప్రజానీకంతో సంబంధాలు పెట్టుకుంటూ ప్రజాపోరాటాల నుంచి అనుభవాలు గడిస్తారు. చారిత్రక అభివృద్ధి సూత్రాలు తెలుసుకుంటూ మార్క్సిజంను బాగా వంటబట్టించుకుని విప్లవకార్యాచరణలో రాటుదేల్తారు. అందువల్ల వారు బాగా దూరదృష్టి గలవారు. మామూలుగా అన్నివర్గాల నాయకులు లాగా వీరికి పరిమితులు లేవు. కనక కార్మిక నాయకులు, చరిత్ర నిర్మాతలైన ప్రజల పాత్రను పూర్తిగా రంగంమీదకు రప్పించగలుగుతారు. సుదీర్ఘ విప్లవ పోరాటాల్లో రాటుదేలడంవల్ల వారికి ప్రజల్లో గౌరవ ప్రతిష్ఠలుంటాయి.

అయితే, శ్రామిక విప్లవంలోనయినా నాయకులూ ప్రజలూ కలిసి చరిత్ర నిర్మిస్తారనడం సరయినదేనా ? కాదు. శ్రామికనాయకులు కేవలం ప్రజల, కార్మికుల కార్యకలాపాలు నిర్వహించేవారే. నాయకులు రంగంమీదకు రావడం వారి ఆలోచనా ధోరణి చరిత్రగతిలో చాలా గొప్పది, ముఖ్యమైనదీ గూడా. 'ఆచరణ' అనే తన రచనలో మావో చెప్పాడు కూడా. విప్లవాన్ని గురించిన మార్క్సిస్టు సిద్ధాంతం విప్లవ పోరాటాల ఆచరణ రెండో దశకు చేరుకున్నాకే రూపొందింది. పూర్తి చైతన్యంతో నిర్మాణాత్మకంగా ఆర్థిక రాజకియ పోరాటాలు చేపట్టిన దశ అదే.

ప్రజలే చరిత్రలో చోదకశక్తి అనే మార్క్సిస్టు అవగాహన, శ్రామిక నాయకుల చారిత్రక పాత్రను గుర్తిస్తుంది. లీషావ్‌చీ వగయిరాలు నాయకులు, ప్రజలు కలిసి చరిత్రను నిర్మిస్తారు అని అంటున్నారంటే దాని అర్థం నాయకులు ప్రజలకు అతీతంగా వుంటారని భావన. వాళ్ళకు మనకు ప్రధానమైన తేడా ఇదే.

ప్రజలే చరిత్ర నిర్మాతలని మార్క్సిజం చెబుతుంది.అయితే ప్రజాఉద్యమాలు వాటంతటవే పెల్లుబుకుతాయని దీని భావం కాదు. లీషావ్‌చీ వగైరాలు చారిత్రక భావవాదాన్ని ప్రచురంచేస్తూ, వీరులే చరిత్ర నిర్మిస్తారని చెబుతూ, ప్రతి ప్రజా ఉద్యమం సబబయినదేనని చెబుతున్నారు. ఉద్యమాలు వాటంతటవే వస్తాయనే మాట మరోరూపంగా చెప్పడం అంటే ఇదే ప్రజలే చరిత్ర నిర్మాతలని చెప్పే చారిత్రక భౌతిక వాదానికి, దీనికి చుక్కెదురు. సరయిన నాయకత్వం, సరయిన పంథా లేకుండా ఏ ప్రజా ఉద్యమమూ ఎక్కువ కాలం సాగలేదు. ఏమీ సాధించ లేదు. దోపిడీ వ్యవస్థను కూకటి వేళ్లతో పెకలించి వేసేదే శ్రామిక విప్లవం. ఇంతకు ముందు ఏ విప్లవంతోనూ దీన్ని పోల్చలేము. అన్నింటి కన్నా ఇది గాఢమైంది. ఇది విశాలమైంది. అందుకే ఈ విప్లవానికి మరింత గట్టి నాయకత్వం సరయిన పంథా అవసరం. సవ్యమైన సైద్ధాంతిక రాజకీయ పంథాయే ప్రతిదాన్ని నిర్ణయిస్తుంది. చైనా విప్లవ చరిత్ర చూస్తే అటు అతివాద ఇటు మితవాద పెడధోరణులకు వ్యతిరేకంగా మావో సరయిన పంథాను ఎలా రూపొందించాడో తెలుస్తుంది. మావో పంథా లేకుండా చైనా విప్లవం విజయవంతం అయివుండేది కాదు. శ్రామిక విప్లవదశలో దానంతటదే ఉద్యమం విస్తరణ చెందడమంటే శ్రామికవర్గ నాయకత్వ పాత్రను నిరాకరించడమే. ప్రజా ఉద్యమాన్ని పక్కదారిలో పట్టించేది ఇలాగే.

చరిత్రగతిలో ప్రజలు క్రమక్రమంగా చైతన్యవంతులయ్యారు. చారిత్రక భౌతికవాదం సామాజిక చారిత్రక అభివృద్ధి సూత్రాలను గొప్పగా పసికట్టింది. ప్రజల పాత్రను రంగంమీదకు తెచ్చింది. ప్రజలు తడుముకోకుండా ఒక తీరుతెన్ను చూపించింది. మావో అన్నాడు: "మానవజాతి చైతన్యంతో తనను ప్రపంచాన్ని మార్చుకున్నప్పుడే ప్రపంచ కమ్యూనిస్టు యుగోదయం జరుగుతుంది." ఆరోజు రావాలంటే, విప్లవం విజయంపొందాలంటే శ్రామికవర్గ నాయకత్వం కింద ప్రజలు మరింత గట్టిగా దీక్షగా పోరాడాలి. జనంమీద మనం విశ్వాసం వుంచాలి. వాళ్ల చొరవను గౌరవించాలి. అదే సమయంలో నిరంతరం మార్క్సిజం-లెనినిజం చైతన్యాన్ని ప్రజలకు కలిగించాలి. లెనిన్ చెప్పాడు: "వర్గంలో పురోగామి భాగమే పార్టీ. ప్రజలను నడపడమే దాని కర్తవ్యం. అంతేగాని యాంత్రికంగా ప్రజల భావాలను క్రోడీకరించడం కాదు." ప్రజలే చరిత్ర నిర్మాతలన్న మార్క్సిస్టు సూత్రానికి కట్టుబడి పార్టీ నాయకత్వాన్ని అనుసరించితే విప్లవపథంలో మనకు విజయ పరంపరలు చేకూరుతాయి.

# ఇరాన్ షా చట్టబద్ధ ఫాసిజం

బీనా

కొద్దిరోజుల క్రితం భారత ప్రభుత్వ అతిథిగా యిరాన్ షా రాజలాంఛనాలతో యీదేశాన్ని సందర్శించాడు. ఆ సందర్భంలో యీదేశంలోని కొన్ని ప్రజాస్వామిక సంఘాలతో పాటు యిక్కడి యిరానియన్ విద్యార్థులు 'షా' వ్యతిరేక ప్రదర్శనలు జరిపారు. ప్రజాస్వామిక(?) మొరార్జీ ప్రభుత్వం వాళ్ళపై లాఠీచార్జీ జరిపి జైళ్ళలో కుక్కింది. "వచ్చింది ఎవరైనా, మా అతిథులనవమానిస్తే వూరుకోం" అంటోంది, మార్క్సిస్టులుబలపరుస్తున్న జనతా ప్రభుత్వం. కాని డాక్టర్ కోట్నీస్ కమిటీ ఆహ్వానంపై భారతదేశానికి వచ్చిన చైనా సౌహార్ద బృందానికి యిచ్చిన స్వాగతం సందర్భంలో టిబెటన్‌లు జరిపిన నిరసన ప్రదర్శన విషయంలో మాత్రం మొరార్జీకి అతిథి మర్యాదలు గుర్తురాలేదు.

ఎవరీ యిరాన్ షా ? జాతీయ అంతర్జాతీయంగా యీ నిరసన ప్రదర్శనలు, వ్యతిరేకపోరాటాలు ఎందుకు జరుగుతున్నాయి ? వురికొయ్యలకు, తుపాకీగుళ్ళకు గురవుతూ కూడా ఎన్నాళ్ళ నుంచో ఎందుకు వీరీ సమరంజరుపుతున్నారు. యిరాన్‌లో యీచట్టబద్ధ ఫాసిజం ఎలా అమలు జరుపబడుతోంది? యివన్నీ అవశ్యం తెలుసుకోదగ్గ విషయాలు.

యిరాన్ జనాభా 350 లక్షలు. వైశాల్యం 628,000 చదరపు మైళ్ళు. యిరాన్ చరిత్ర అంతా దీర్ఘకాల పోరాటాలమయం. యీ పోరాటాలు ముందు వలసవాద వ్యతిరేకంగాను చివర్లో సామ్రాజ్యవాద వ్యతిరేకంగాను జరిగాయి. 1906 లో లభించిన పాక్షిక విజయం ఫలితంగా, క్రమంగా ఆ తర్వాత కాలంలో చట్టబద్ధ ప్రభుత్వం ఏర్పడింది. 1951 _ 53 దాక నడిచిన ప్రభుత్వానికి డాక్టరు మొహమ్మద్ మొసడెగ్ (Mossadegh) అధ్యక్షుడు. సి. ఐ. ఏ. కుట్ర ఫలితంగా 1953 ఆగస్టులో జరిగిన ప్రతిఘాతక తిరుగుబాటులో రాచరికపు షా యిరాన్ గద్దెనెక్కాడు. ఆక్షణంనుంచే చిత్రహింసలు, మానభంగాలు, ఉరికొయ్యలు, తుపాకీ కాల్పులు ప్రారంభమయ్యాయి. మానవత నిలువులోతు గోతిలో పూడ్చి పెట్టబడింది.

పీడన వున్న చోట ప్రతిఘటన అనివార్యంగా వుంటుంది. 1960 లో జరిగిన ప్రభుత్వ వ్యతిరేక వుద్యమ ఫలితంగా షా కొంత వెసులుబాటు వైఖరి ప్రదర్శిస్తున్నట్లు నటించాల్సొచ్చింది. ఉద్యమకారుల కన్నీటి తుడుపుగా సంస్కరణల్లాంటి కొన్ని సవరణలు చేసి, వేరొక వంక ఆమిషతో ప్రతిపక్షాన్ని దారుణంగా అణచేసాడు. మాన

చేతిహాసంలోనే కనీ వినీ ఎరుగనిరీతిలో అత్యంత దారుణమైన ఫాసిస్ట్ పద్ధతుల్లో యీ అణచివేత కొనసాగింది. 1963 జూన్ 5న, ఆ ఒక్క రోజునే, పదిహేను వేల మంది ప్రజలు మెషిను గన్ కాల్పులకి బలయ్యారు. దీన్ని 'శ్వేత విప్లవం'గా షా ప్రకటించుకొన్నాడు. చాలా స్వల్పకాలం నిర్బంధానికి గురై, యిటీవలే జైళ్ళ నుంచి బయటపడ్డ "సంపూర్ణ విప్లవ నేతలు" యీ మహనీయుడికి స్వాగతం పలికారు_ యీ ఫాసిస్ట్‌కి నల్లజెండాలు చూపినవారిని లాఠీలతో చావబాదారు.

అర్థ-భూస్వామ్య ఆర్థిక విధానంగల యిరాన్ అమెరికా రంగప్రవేశంతో పెట్టుబడిదారీ పంథాలోకి నెట్టబడింది. తద్వారా అమెరికాకు ఒక బలమైన స్థావరంగా మార్చబడింది. 63.5 శాతం కార్మిక కుటుంబాలు వారానికి 7 డాలర్లకన్నా తక్కువ ఆదాయంతో బతుకుతున్నారు. అక్కడి జీవన వ్యయం ప్రకారం ఒక పూట తిండికి నోచుకోని కుటుంబాలు అసంఖ్యాకం_ విద్యా, వైద్య సౌకర్యాలు వీళ్ళకి మృగ్యం.

నూటికి 70 మంది నిరక్షరాస్యులు- 25 శాతం పిల్లలు బడి అనేది వాళ్ళ జీవితాల్లో ఎరగరు_ మట్టి గుడిసెల్లోనే కార్మిక జీవితాలు గడుస్తుంటాయి. 75 శాతం యిళ్ళకి విద్యుచ్ఛక్తి వుండదు_ 85 శాతానికి నీటి సౌకర్యం వుండదు- సంపదలు సృష్టించే శ్రామికవర్గం కడుపులు మాడ్చి, కులీనవర్గానికి అన్ని అధునాతన సౌకర్యాలు సమకూర్చబడ్డాయి. నూనె వనరులమీద వచ్చే కోట్ల ఆదాయంలో 60 శాతం మారణాయుధాల కొనుగోలుకి వెచ్చింపబడుతుంది.

జాతీయంగా, అంతర్జాతీయంగా వెల్లువలా పొంగుతున్న ప్రతిఘటనలని అణచాలని నియంత షా అనేక కిరాతక పద్ధతులు అవలంబిస్తున్నాడు. లక్షమంది రహస్య బలగంతో షా ఏర్పాటు చేసిన సావక్ (Savak) అనే రహస్య గూఢచారి పోలీస్ సంస్థ ఈ కిరాతకాలు నెరపుతుంది. సావక్ ఏర్పడ్డాక అణచివేతతోపాటు, ప్రతిఘటన మరింతగా పెరిగింది. జైళ్లలో కూడా మొక్కవోని విప్లవ ధృతితో గెరిల్లాలు పూపిర్లు పీలుస్తున్నారు. జైళ్ళలోని వారి సంఖ్య లక్ష మందికి మించవచ్చని అంచనాలు తెలుపుతున్నాయి.

1963 జూన్ ఘటన అనంతరం యీ సాయుధ నియంత పాలనకు వ్యతిరేకంగా రహస్య సాయుధ పోరాటం ప్రారంభమయింది. షా తన ప్రజాస్వామిక ముసుగు వదిలి నగ్నంగానే వుద్యమకారులపై పడ్డాడు- యిరాన్‌లో 2500 సంవత్సర సంరంభాలు (2500 Year Celebrations) ప్రారంభమయ్యాయి. యీ రాచరికపు జాతరకు వ్యతిరేకంగా ప్రదర్శనలు నిర్వహించబడ్డాయి. ఆనాడు నాలుగు వేల మందిదాకా

జైళ్ళలో కుక్కబడ్డారు. నిర్బంధం తన పులి పంజా విసరటం జోరుచేసింది. ఆనాటి నుంచి సాగుతున్న అమానుష నిర్బంధం నుంచి యీనాటికీ యిరానీయులకి విముక్తి లభించలేదు.

1972 ఏప్రిల్ 24 న్యూస్‌వీక్ పత్రికలో లార్డ్ జెన్‌కిన్స్ యిలా రాశారు- "సావక్ వేట ఫలితంగా, ఎలాంటి నేరారోపణ లేకుండానే వేలాదిమంది నిర్బంధించబడ్డారు- చిత్రహింసలకు గురయ్యారు- కనీసం 12 మంది అనుమానితులు పోలీసులు ప్రశ్నించటమనే (interrogation)మానసిక అమానుష చిత్రహింస నుంచి తప్పించుకొనేందుకు ఆత్మహత్యలకి పాడిగట్టారు."

షా యీ ఫాసిస్ట్ పద్ధతుల్ని చట్టబద్ధం చేశాడు- ఆమేరకు మిలటరీ శిక్షాస్మృతిని సవరించాడు. అందులో కొన్ని సవరణలు-

[1] రాచరికానికి వ్యతిరేకంగా రహస్య కుట్రలు సాగిస్తూ, ఆయుధాలు వుపయోగించే సంస్థల సభ్యులందరూ తుపాకుల్తో అంతమొందించబడతారు.

[2] సవరించిన మిలటరీచట్టం ప్రకారం యిరాన్ సమగ్రతకు, షా రాచరికపు సార్వభౌమత్వానికి వ్యతిరేకంగా వుద్యమం సాగించేవారు తీవ్ర దండనకి అర్హులు- అలానే కమ్యూనిస్ట్ సిద్ధాంతాల వ్యాప్తికై కృషి చేసేవాళ్ళు కూడా కఠినశిక్షలకి పాత్రులు.

[3] యీ శిక్షలు మరణదండన నుంచి యావజ్జీవ శిక్షదాకా ఏదో ఒకటి కావచ్చు. దేశద్రోహులను [షా వ్యతిరేకులు] చిత్రహింసలకు గురిచేసి, వాళ్ళని తుపాకీతో కాల్చే హక్కు చట్టబద్ధం చేయబడింది.

[4] రచనలు, కరపత్రాలు, వుపన్యాసాలు వేటివల్లగాని ప్రాదేశిక సమగ్రతకు, శాంతిభద్రతలకు భంగంకలిగితే, అందుకు బాధ్యులైనవాళ్ళు యావజ్జీవ శిక్షకు అర్హులు. యీ ఆందోళనవల్ల ప్రజా మరణాలు సంభవిస్తే, ఆందోళనకారులకి మరణదండన విధించబడుతుంది.

[5] దేశవిభజనకు దారితీసే ఎలాంటి చర్య అయినా, సాయుధ తిరుగుబాటుకు చెందిన ఏ అంశమైనా వురిశిక్షకు పాత్రమైందే.

[6] పట్టుబడకముందే లొంగిపోయి, పోలీసులకు సహకరించిన వారియెడల వుదార వైఖరి అవలంబించబడుతుంది.

ఇలాంటి ఎన్నో ఫాసిస్ట్ నిబంధనలతో నడిచే షా పరిపాలనకు, శాంతికాముకుడుగా పోజుకొడ్తున్న కార్టర్ వత్తాసు వుంది.

కొన్ని సంవత్సరాల క్రితమే నియంత షా దేశంలోని అన్ని రాజకీయ పార్టీలను, గ్రూపులను నిషేధించాడు. అనుమతించిన ఒకే ఒక రాజకీయ పక్షం యిరాన్ షా నాయకత్వాన గల 'రస్తాఖిజ్' (Rastakhiz) పార్టీ మాత్రమే. దేశంలోని ప్రతి వొక్కరు యీ పార్టీలో చేరి విధేయులుగా వుంటమో, లేదా జైళ్ళకు పోవటానికో, ప్రాణాలు పోగొట్టుకోటానికో సిద్ధపడి వుండాలి.

అనుమానితుల సాకుతో వేలాది మందిని నిర్బంధించటం, అమానుషంగా ప్రశ్నించటం, వేధించటం, మారణాయుధాలతో బాదమోదటం, వాళ్ళకి శాశ్వత అంగవైకల్యం కలిగించటం, స్త్రీ పురుష తేడా లేకుండా చెరచటం, వొళ్ళంతా కాల్చటం, ఇలా ఎన్నోదారుణాలు సావక్ చేతిమీదుగా నిరాటంకంగా సాగుతున్నాయి. ఆ దేశంలో నేరాలు విచారింపబడేది కోర్టులలో కాదు; సావక్ కార్యాలయాల్లో: శిక్ష విధించేది న్యాయమూర్తులు కాదు; సావక్ పోలీసు మిలిటరీ ఝుంటా: న్యాయచట్టాలలాగే న్యాయ నిర్ణేతలు సావక్‌కి జోహుకుం గాళ్ళు అయ్యారు.

షా డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికకి ఇచ్చిన యింటర్వ్యూలో కమ్యూనిస్టులపట్ల తన వైఖరి ఎలాంటిదో స్పష్టంచేశాడు; "మా దేశంలో కమ్యూనిస్టుల్ని జైళ్ళలో నిర్బంధిస్తాము- విచారణలో వాళ్ల నేరస్థులుగా రుజువైతే, వాళ్లని కాల్చి చంపుతాము కూడా." యిరాన్‌లో ప్రభుత్వ వ్యతిరేకులపట్ల నిష్పాక్షిక విచారణ అనేది గగన కుసుమమే. అందులోనూ కమ్యూనిస్టులపట్ల అది కల్లోకూడా వూహింపరాని విషయం.

యిరాన్ బయట ప్రపంచంలో విస్తరించివున్న వివిధ సంఘాలలోని యిరానీయుల కార్యకలాపాలపై కూడా సావక్ కన్నువేస్తుంది. కొంతమందిని యిరాన్‌కి పిలిపించే ప్రయత్నాలు చేస్తుంది- కొంతమంది తీవ్రవాదులకి, వాళ్లపరోక్షంలో శిక్షలు నిర్ణయించబడతాయి.

యిరాన్‌లో అమరవీర కుటుంబాలను కదిపితే గుండెలు ద్రవించే, నెత్తురు ఎరుపెక్కే అనేక సంఘటనలు తెలుస్తాయి. మన 'తాబేలు నాయుడు' లాంటి కుటుంబాలు ప్రపంచమంతటా ఎన్నో వున్నాయనిపిస్తుంది.

షా దౌష్ట్యానికి బలైపోయిన వేలాది కుటుంబాల్లో నాదర్ షెయెగన్ (Nadar Shayegan) కుటుంబమొకటి. 1973 లో టెహరాన్‌లో జరిగిన పోరాటంలో షా భద్రతాదళాలు నాదర్‌ను తుపాకీతో కాల్చిచంపారు. నాదర్ తల్లి అంతటా కామ్రేడ్ మదర్ (Comrade Mother) గా సుపరిచితురాలు. ఆమె 'యిరాన్‌ప్రజల ఫెదయీ గెరిల్లాల' (Iranian Peoples Fedayee Gurrillas) సంస్థతో కలిసి విప్లవోద్య

మంలో పాల్గొనింది. ఆమె తన 13 ఏళ్ళ నాసర్, 12 ఏళ్ళ అర్జంగ్‌లనే యిద్దరి పిల్లలతో రహస్య వుద్యమంలో చేరింది. అప్పటికి ఆమె వయస్సు 53 సంవత్సరాలు. కొడుకు మరణం తర్వాత 1973 లో సావక్ దళాలు ఆమెని అరెస్ట్‌చేసి, 12 ఏళ్ళ జైలుశిక్ష విధించారు.

ఫాసిస్టు సావక్ దళాలు 1976 మే లో ఒక యింటిని పేల్చేసారు. ఆ సందర్భంలో మరణించిన 22 మందిలో అర్జంగ్, నాసర్‌లుకూడా వున్నారు- అయినా ఆ తల్లి నీరసపడలేదు- విప్లవదీక్ష సడలలేదు. ఆ తర్వాత నాదర్ షెయెగన్ 9 ఏళ్ళ కొడుకు ఎబోల్ హసన్ (Abol Hassan) కూడా వీరమరణం చెందాడు. నాదర్ కుటుంబపు యీ నల్గురు వీరులు యిరాన్ సాయుధ విప్లవ యువ అమరకిశోరాలు.

రచయితల చేతులకు బేడీలువేసినా, కార్మికులను సన్నీలతో అణుస్తున్నా, విద్యార్థులు, మేధావులని చిత్రహింసల పాల్జేసినా, అలలు అలలుగా విప్లవోద్యమం పురోగమిస్తోనే వుంది. యీ వ్యాసాన్ని నాదర్ 11 ఏళ్ళ తమ్ముడు జైల్లోని కామ్రేడ్ మదర్‌కి రాసిన సుదీర్ఘ లేఖలోని కొన్ని అంశాలతో ముగిస్తాను-

"కామ్రేడ్ మదర్....

జైలులో మీ పోరాటం ఎంతో సంతోషాన్ని కలిగిస్తోంది. పాశవిక చిత్రహింసలతో కూడిన యీ అనాగరిక పరిపాలనకి వ్యతిరేకంగా దృఢనిశ్చయంతో కూడిన మీ పోరాటం నిజంగా నన్ను వుత్తేజపరుస్తోంది- జైలులో మీ తోటి పోరాట సహచరులకి నా తరపున, సంస్థ సభ్యులందరి తరపున ధన్యవాదాలు అందచేస్తున్నాం.

అమ్మా.... ప్రజలందరి గురించే నిత్యం ఆలోచించి, వాళ్ళకోసమే సమరశీల పోరాటాలు కొనసాగించే వాళ్ళని, ప్రజాశత్రువులపట్ల ఎనలేని ద్వేషాన్ని కలిగినోళ్ళని, వీరులని ... ఎవరినీ వీళ్ళు వదలరని తెలుసు. అభివృద్ధి నిరోధక షాకి వ్యతిరేకంగా పోరాడేందుకుగాను యిరానులో యివాళ చాలా గెరిల్లా దళాలు పనిచేస్తున్నాయి. యీ అణచివేత, విప్లవ ప్రతిఘాతక విధానాలకి వ్యతిరేకంగా మనం జరిపే పోరాటంలో సాయుధ పోరాటమే ఏకైక మార్గం. శత్రువు ఆయుధరీత్యా ఎంత బలవంతుడైనా యిరానియన్ గెరిల్లాలని నిర్మూలింపజాలడు. కమ్యూనిస్ట్ నూతనోత్తేజంతో క్షణాలు గడుపుతూ వూపిర్లు పీలుస్తున్న మిమ్మల్ని శత్రువు ఏంచెయ్యలేడు.

అమ్మా.... సియా-కల్ (Siah-kal) సంఘటన తర్వాత నూషిర్‌వాన్‌పూర్ (Noorshirvanpur) లొంగిపోయి, వుద్యమానికి ద్రోహంచేశాడు- ప్రభుత్వ టి.వి.

## స్నేహం వర్ధిల్లాలె

సుహృద్భావ సంఘానికి
సుహృద్భావ ఆహ్వానం
పంచశీల తత్వానికి
పంచశీల వ్యవహారం
ప్రజలకు ప్రజలకు మధ్య
పగలులేవు పొగలులేవు

పుడమి వొడిలో వికసించిన
ఎడదలన్ని వొకటేనోయ్
మనిషికి మనిషికి మధ్య
స్నేహం వర్ధిల్లాలె
మనుజులు అందరు కలిసి
క్షేమంగా బ్రతకాలి.

— కాళోజి
17-3-78

(చైనా సౌహార్ద్ర బృందం హైదరాబాద్ వచ్చినపుడు కాళోజి వినిపించిన కవిత)

---

లలో షాకు అనుకూల ప్రచారం చేశాడు. విప్లవ ప్రయోజనాలరీత్యా వాన్‌పూర్‌ని వురితీశాం. అలానే అనేక మంది నమ్మక ద్రోహులని వురితీసి విప్లవ ఫలితాలను కాపాడుకొంటున్నాం. జైలులో మన ప్రియతమ కామ్రేడ్ అష్రఫ్ దెహఘాని (Ashraf-Dehghani)ని చిత్రహింసలు పెట్టిన సావక్ ప్రముఖుడు 'నిక్‌తాబ్'ని కడతేర్చాం. మన కామ్రేడ్ల మరణశిక్షలకు చిత్రహింసలకు కారణమైన ఎంతోమంది సావక్ అధికారులలో కొద్దిమందిని మట్టుపెట్టి పగ తీర్చుకొన్నాం.

ఈ విప్లవ పురోగతిలో అనివార్యంగ మేం కొన్ని నష్టాలకి గురయ్యాం. కామ్రేడ్స్ పారి, నజాత్-అల్-సాదత్ రూహి అహంగరన్, సైది, సంజారి, అలీ-అక్బర్ జాఫ్రి, మార్తిక్ గజరన్, మొహమ్మద్ బొలొరి....ని, అలానే కామ్రేడ్ జజాని విప్లవ బృందాన్ని.... ఎంతోమందిని పోగొట్టుకొన్నాం....

అమ్మా.... మేం యివాళ అధ్యయనం, ఆచరణలలో దేన్నీ విడిచిపెట్టటంలేదు. సంస్థ పురోభివృద్ధికై చాలా లోతుగా అధ్యయనం కొనసాగిస్తున్నాం.

అమ్మా.... యీ దేశం షా కబంధహస్తాల నుంచి విముక్తి అయి, యీ జైళ్ళ నుంచి విడుదలయ్యే మీ అందరిని కలుసుకొనే శుభగడియల కోసం అందాకా ఆతృతగా నిరీక్షిస్తుంటాం.

విజయంపట్ల ప్రగాఢ విశ్వాసంతో
నీ కామ్రేడ్.

ఎన్నో కష్టాలకు, ఆటుపోట్లకు తట్టుకొంటూ సాగుతున్న యిరాన్ గెరిల్లాల పోరాటం ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో భాగమే. ప్రపంచ విప్లవకారుల మద్దతు వీరికి తప్పనిసరిగ వుంటుంది.

# జైల్లో మేడే

బొజ్జా తారకం

అత్యవసర మబ్బులు మూగిన
ఆకాశంలో
ఇంకా సూర్యుడుదయించని
ఓ మేడే ఉదయాన
జైల్లో ఎర్ర జండా ఎగిరింది

శ్రామిక జన శక్తి నిండిన
వర్గ చైతన్య రక్తం పొంగిన చేయి
ఎత్తుగా ఆకాశంలో
ఎత్తి పట్టుకుంటే
ఎర్రజండా ఎగిరింది

పీడిత జనతా విముక్తి కోసం
పాటులు పడుతున్న
పాటలు పాడుతున్న
గొంతులు గుంపుగా
పాటపాడుతుంటే
ఎర్రనిజండా ఎగురుతూవుంది;

'డామిట్ !'
జైల్లో ఎర్రజండా !
ఎక్కడిదెక్కడిదంటూ
లాఠీల టపటపలతో
బూట్ల టకటకలతో
జైలంతా హడావిడి

వెతకండి వెతకండి
ఎర్రనిజండా ఎగురుతోంది

అధికారం కప్పిన మసకలతో
ఉన్నవాళ్ళకు
'సుత్తీకొడవలి గుర్తుగవున్న
ఎర్రనిజండా ఎగురుతున్నది'
పాట వినిపిస్తున్నది,
జండా కనబడడం లేదు.

ఏదీ ఎర్రని జండా
పాడే వాళ్ళ కళ్ళల్లో
కదలాడుతున్న
పాడేవాళ్ళ గుండెల్లో
రెపరెపలాడుతున్న
పాడేవాళ్ళ గొంతుల్లో
మ్రోగుతున్న
ఎర్రనిజండా
వాళ్ళకెక్కడ కనిపిస్తుంది ?!

ఎగురుతోంది, ఎగురుతోంది
ఎర్రని జండా ఎగురుతోంది
మేడే నాడా
జైలుగోడల మధ్య.

సెంట్రల్ జైలు, హైదరాబాదు
మేడే, 1976

# ఉగాది పంచాంగమ్

నారా

ఈ ఏడాది ఎలా గడవబోతోంది
ఎంతమంది ఈ ఉగాదినాటికీ తిండిలేక చచ్చిపోబోతున్నారు
మరెంతమంది రోడ్డుపక్క మురిక్కాలవల పక్క బతకడానికి పుట్టబోతున్నారు
ఎందరు జైళ్ళల్లో కుక్కబడబోతున్నారు
మరెందరు అడిగేవాడులేక అడవుల్లో కాల్చబడబోతున్నారు
ఎందరు మంత్రి పదవులకోసం ఎగబాకబోతున్నారు
మరెందరు ఉద్యోగాలకోసం వాళ్ళకాళ్ళమీద పడబోతున్నారు
ఎందరు కల్తీ సరుకులు అమ్మబోతున్నారు
మరెందరు వాటికోసం క్యూల్లో వడిగాపులు పడి శోషవచ్చి పడిపోబోతున్నారు
ఎందరు అందలా లెక్కబోతున్నారు
మరెందరు వాటిని మొయ్యలేక కొయ్యబారిపోతున్నారు
ఎందరు బతకలేక చచ్చిపోతున్నారు
ఎందరు చావలేక బతుకుతున్నారు
ఈ దేశం ఈ ఏడాది ఏం కాబోతోంది?

*   *   *

ఇలాంటి చచ్చు సమస్యలు మావి కావు

"నన్నయ్యగారి ప్రసన్నకథా కవితార్థయుక్తి"
"తిక్కనగారి హరిహరిగాథ తత్వము"
"తెలుగు పలుకులలోని తియ్యందనము"
"విద్యానగర రాజ్య వైభవము"
"శ్రీకృష్ణునికి మీసములుండెడివా?"
"వైదిక ధర్మ పరిరక్షణము"
"ప్రపంచ ప్రఖ్యాతులైన తెలుగు మహాకవులకు,
శిలా విగ్రహములు నిర్మించవలసిన యావశ్యకత"
"నన్ను మహాకవిగా గుర్తించవలసిన యవసరము"

# అగ్ని శిరస్సున వికసించిన వజ్రం

[కామ్రేడ్స్,

మీతో ఒక్క క్షణం.

'చాంగ్‌పీ' మైదానప్రాంతంలో శత్రువుతో జరిగిన పోరాటంలో నావంతుకర్తవ్య నిర్వహణకు ప్రశంసలు పొందినమాట నిజమే. వ్యక్తిగత ప్రశంసలంటే నాకు సుతరాము యిష్టంలేదు. ఎందుకంటే ఏ ఒక్క వ్యక్తి కారణంగా ఆ నిర్దిష్ట పరిస్థితుల్లో అంతటి మౌలికమయిన మార్పులు వస్తాయనుకోను. ప్రతి మార్పు వెనుక ప్రజల సమిష్టి కృషి, త్యాగం తప్పనిసరిగ వుండి తీరుతాయి. మొత్తంగ జరిగిన సంఘటనలను పరిశీలించండి. కాకపోతే కనీసం నేను నా ప్రయత్నంమీద బయలు దేరిన ఆ ఒక్క రాత్రి ఘటనలనే తీసుకోండి. ఆ రోజున చిరంజీవి కామ్రేడ్ చెన్, అతని కుటుంబ సభ్యుల త్యాగంవల్ల కాకపోతే (ప్రశంసలు సంగతటుంచండి) ఈ కథ మీకు వినిపించే అవకాశమే నాకు వుండేది కాదు. త్యాగం, విలువ ఎక్కడుంటాదో నాకు బాగా తెలుసు. అందుకనే ఎవరైనా నా అనుభవాలని ప్రశ్నించి నప్పుడల్లా, తప్పనిసరిగా కామ్రేడ్స్ చెన్, అతని కుటుంబ సభ్యులు నా స్మృతిపథంలో మెదులుతారు. ఎవరా కామ్రేడ్? ఏమా కుంటుంబం? పార్టీకి, ప్రజకి వాళ్ళు ఏంచేశారు? వాళ్ళ జీవితాలు ఏవిధంగా విప్లవీకరించబడినాయి? ఏమేలు కోసం వీళ్ళంతా యిలా?

తెలుసుకోవాలనికుతూహలంవుంటె....వినండి చెబుతున్నా

## I

అది 1947వ సంవత్సరం. ఆకురాలు కాలం.

విముక్తి ప్రాంతాలనుకొన్న వాటిలో తిరిగి కొమింగ్‌టాంగ్ సైన్యాల విధ్వంసకార్యక్రమాలు వుధృతమవుతున్నాయి. మాకు అనేక ఆటంకాలు ఎదురయిన ప్రాంతం, అలాగే యీ ఘటనలకు మూలమైన ప్రాంతం పేరు 'షాంటుం'. చిన్న ద్వీపకల్పం. ఈ ప్రాంతాని కీవలనున్న విశాలమైన లోతట్టుప్రాంతం మన అధీనం క్రిందే వుండేది; కొన్ని కారణాలవల్ల చేజారిపోయింది. కొమింగ్‌టాంగ్ సైన్యాల రాక చూసుకొని, 'తిరోగామి దళా'లనబడే గుంటనక్కలన్ని గ్రామాల్లో ప్రవేశించాయి. ఒకప్పుడు ప్రజాసైన్యాలు తన్ని, తగిలేస్తే బ్రతుకు జీవుడాని పారిపోయిన ప్రజాకంటకులైన భూస్వాములు, వాళ్ళ తొత్తులు, తాబేదార్లే యీ తిరోగామి దళాలు. ఆ సైన్యాల అండతో శ్రమజీవులని కొల్లగొట్టడం, హతమార్చడం వీళ్ళ పని. యిదే సమయంలో అక్కడి విముక్తిప్రాంత ప్రజా ప్రభుత్వానికి సంబంధించిన యావన్మంది ప్రజ సమీకృతులవుతూ

'సాయుధ ప్రతిఘటనా దళాలు'గా రూపొందుతున్నారు. నేనప్పుడు 'చాంగ్‌పీ' ప్రదేశానికి పడమటి ప్రాంతాల పనిచేస్తున్నాను. నేనున్న ప్రాంతాని, ఆవలి ప్రదేశానికి మధ్యనున్న కీలకమైన నదీ తీరప్రాంతంమీద శత్రువుకి గట్టి పట్టువుంది। ఒకరోజు మునిమాపువేళ 'రాజకీయ విభాగ అధిపతి' నుంచి వెంటనే రమ్మని కబురొచ్చింది. చిమ్మ చీకట్లు కమ్ముకొంటున్న వేళకి, నేను అక్కడికి చేరగలిగాను. నేను వెళ్ళేసరికి మా కమాండరు ఎంతో ఆవేదనతో, సాలోచనగ ఎక్కడికో దృష్టిసారించి నిలబడి వుంటం చూశాను. క్షణకాలం నివ్వెరపోయా. బహుశా ఏదో జరగరానిదే జరుగుందచ్చని పించింది.

"రండి కామ్రేడ్- చాంగ్‌పీ ప్రాంతంలో ఏంజరిగింది మీరు వినే వుంటారు" అన్నారాయన.

"తెలియదు కమాండరు- ఏం జరిగిందో చెప్పండి."

"ఒకటవ సాయుధ ప్రతిఘటనా పటాలం కుప్పకూలిపోయింది. మన కామ్రేడ్స్ మా-హా-టుంగ్, లీ-చున్‌లు విప్లవ పోరాటంలో ఒరిగిపోయారు. మనం యిద్దరు గొప్ప కామ్రేడ్స్‌ని కోల్పోయాం."

ఒక్కొక్క మాట ఆయన నోటివెంట ఎంతో బరువుగా, బాధగా వెలువడ్డాయి. ఇది నేనూహించని పరిణామం. మా కందరికీ పిడుగులాంటి వార్త. ఆ పటాలం గాని, ఆ కామ్రేడ్స్‌గాని పోరాటాల్లో రాటుదేలినవాళ్ళే. జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా కాలంలో ఆనాటి గెరిల్లాపోరాటంలో కలిసి ఎంతోకాలం పనిచేశాము. ఈమధ్యకాలంలో వాళ్ళు 'షాంటుంగ్' ప్రవేశించి శత్రువర్గాల స్థావరాల్లో భూకంపాలు సృష్టించారు. వాళ్ల పేరే సింహస్వప్నమయింది। తూర్పు తీర ప్రాంతమంతా శత్రు వ్యూహంలో చిక్కుకుంది। ఎక్కడి కక్కడ వాళ్లకి రవాణా సౌకర్యాల నుంచి, వార్తా ప్రసార కేంద్రం దాక ఏర్పాటయి, కంచుకోటగా వున్న ప్రాంతమది. అలాంటిచోట కామ్రేడ్స్ మా, లీల నాయకత్వాన వున్న సాయుధ ప్రతిఘటనా పటాలం అనుక్షణం శత్రువుని చికాకు పరుస్తూ, వార్తా ప్రసారాలకు అవరోధాలు కల్పిస్తూ, తిరోగామి దళాలకు పక్కలో బల్లెంలా తయారయ్యారు.

పార్టీలో చేరిన కొన్ని చీడపురుగులవల్ల మన కామ్రేడ్స్‌వున్న రహస్య ప్రాంతం శత్రువుకి తెలిసిపోయింది। ఈ వివరాలు చెబుతూ, "శత్రువుతో తలపడుతూ ఆ ప్రదేశాన్ని ఒకరోజంత కాపాడుకొన్నారు- ఆ తర్వాత...."

కొద్దిక్షణాలు ఆగి సిగరెట్ ముట్టించి, నాతో అన్నారు-

"కామ్రేడ్ యో! మిమ్మల్ని కమాండరుగా, యాంగ్‌ని డిప్యూటీ కమాండరుగా అక్కడికి పంపించదలిచాము. ఈ క్షణమే మీరు వెళ్ళాల్సివుంది. చెల్లా చెదురయిపోయిన వాళ్ళందర్నీ నిర్మాణంలోకి సమీకరించి, తిరిగి పోరాటాన్ని కొనసాగించాలి. మీరేమనుకుంటున్నారో చెప్పండి?"

ఏ కామ్రేడ్ అయినా అంతగౌరవం ఎదురవుతుంటే ఏమనగలడు? అంతా స్పష్టంగా తెలుస్తూనే వుంది. నది దాటి, తూర్పు ప్రాంతానికి చేరి, పోరాటాన్ని తుదకంటా కొనసాగించాలి. సాయుధ ప్రతిఘటనా దళాల్ని రూపొందించుకోవాలి. మనసా వాచా నా యావత్ శక్తిని అందుకోసమే వినియోగించ దలుచుకొన్నాను. హృదయపూర్వకంగా ఆయనతో కరచాలనంచేసి, కామ్రేడ్ యాంగ్ కోసం బయలుదేరాను.

ప్రతి నిముషం విలువైంది. మేమున్న చోటి నుంచి చేరాల్సిన ప్రాంతం 40 మీ'ల దూరం. మధ్యలో శత్రువు బలమైన వ్యూహాలనుంచి తప్పించుకొంటూ, కీలకమైన నదిని దాటివెళ్ళాలి. పగటి ప్రయాణానికి అవకాశంలేదు. అయితే ఎటువెళ్ళాలి అనే విషయంలో మా యిద్దరికి ఏమీ తెలియదు. దారంతా కొత్త. పైన చీకటి కాటుకలా పేరుకొంది. ఒక తప్పటడుగువేసినా, ఉదయానికల్లా చేరకపోయినా, మా గురించిన ప్రశ్నే వుండకపోవచ్చు. అయితే మా గురించిన బాధకన్నా, మా ముందున్న కర్తవ్యం చాల ముఖ్యమైంది. తప్పనిసరిగా ఆ ప్రాంతాల పరిచయం వున్న 'గైడు' సహాయం లేందే మేము అక్కడికి చేరలేం. అదేమోకాని, ఆరోజు కార్యాలయంలో చిన్న పిల్లవాడు మినహా ఎవరూ లేరు.

సుమారు 16 ఏళ్ళుండొచ్చు. కాస్త పొట్టిగా వుంటాడు. అతని అనుభవాల గుర్తుగా గడ్డంమీద పెద్దగాటు. చిన్న పిస్తోలు. కళ్ళలో వెలిగే చిరుమందహాసంతో చాలా చురుగ్గా కనిపించాడు. కమాండరు ఆప్యాయంగా అతని వెన్ను నిమురుతూ, "హలో కామ్రేడ్ చెన్! ఎలాగున్నావ్?" అంటూ, "నీవో పెద్ద పనిచేసి పెట్టాలి! ఏం? అన్నట్టు ఈయన కమాండరు యో, వీరు డిప్యూటీ కమాండరు యాంగ్! వేకువకల్లా వీరిద్దర్నీ నది దాటించి, తూర్పు తీరం చేర్చాలి. ఏమంటావు?"

"తప్పకుండా చేస్తాను కమాండరు!" అనంటూంటే, ఆ పసివాని గొంతులో ఎంతో విశ్వాసం ధ్వనించింది. మాకెందుకో అతనిమీద సదభిప్రాయం కలగలేదు. యితనా మమ్మల్నావలి గట్టుకు చేర్చేది అనిపించింది. మా మనోభావాల్ని యిట్టే పసిగట్టిన కమాండరు నవ్వుతూ, 'కామ్రేడ్ చెన్ విషయంలో మీ కెలాంటి అనుమానాలు వద్దు! పసివాడైనా, ఎంతో నమ్మకస్తుడు, నిజాయితీ పరుడు, అనుభవశాలి. యింత

చిన్న వయసులోనే ఎంతో అందెవేసినచేయి! నది పక్కపక్కలే తిరుగుతూ, ఎంతో సన్నిహిత సంబంధం పెంచుకొన్న వ్యక్తి. పైగా మొత్తం కుటుంబం పార్టీ సభ్యులు" అంటూ మాకు పీఠ్ఠలు పలికారు ఆయన.

## II

కారుచీకటి- అతి దగ్గరలో ఏముంది కనిపించటమే గగనంగా వుంది. భూమ్యాకాశాలని చూస్తుంటే ఆద్యంతాలున్నట్టుగా అనిపించటం లేదు. వున్నట్టుండి దూరంగా ఎక్కడో వురుములు వినిపించాయి- దట్టమైన మబ్బుల్ని చీల్చుకుంటూ మెరుపులు కన్పిస్తున్నాయి- గాలి ఒక్కతడవగా మట్టివాసన వేయటం మొదలెట్టింది- పెద్ద తుఫానువచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. అంతరాంతరాల్లో మేం ఎందుకు బయలుదేరింది మర్చిపోలేదు. రెండు మూడు రోజుల్లోనే దళ సమీకరణ జరిగి తీరాలి! కొత్త కొమింగ్ టాంగ్ దళాలు ఆ ప్రాంతానికి చేరుకోగానే ఏరివేత కార్యక్రమం మొదలెడతారనే సమాచారం అదివరకే చేరింది. ఈలోపునే ప్రతిఘటనకి సిద్ధంగా లేకపోయినట్టయితే వున్న ఆకాస్త అవకాశాన్ని చేజార్చుకొన్నట్టవుతుంది! అంటే ప్రజలు తిరిగి కష్టాలకు గురికావటమే. మైదాన ప్రాంతం వాళ్ళు యిక్కడవున్న దళాలతో సంబంధాలు పెట్టుకొని తిరిగి శత్రువుని దెబ్బకొట్టే అవకాశాన్ని పోగొట్టుకోవడమే. అందుకే అన్ని ఆటంకాలను అధిగమిస్తూ, ఆవలిగట్టుకు చేరాల్సిందే!

గాలివేగం హెచ్చి, సముద్రపు వొడ్డుకి ఎగసిపడే కెరటాల ధ్వనిలా మారింది! కొంచెం సేపటికల్లా వురుములు, మెరుపుల్తో ప్రకృతి మొత్తం విలయంగా మారిపోయింది- ఝంఝూమారుతంగా వీచే గాలితోపాటు, కుండపోతగా వర్షం మొదలైంది- చెవులు దిబ్బెళ్ళు పడిపోతున్నాయి- కళ్ళు బైర్లు కమ్మి, ఏమీ కన్పించటం లేదు. చీకట్లో అలానే తడువుకుంటూ, గజిబిజిగా దారెంట కదులుతున్నాం. వ్యతిరేకంగా వచ్చిపడ్డ వర్షాన్ని తిట్టుకుంటూ, ప్రమాదంతో కూడిన మార్గంగుండా, పార్టీ మామీద వుంచిన విశ్వాసాన్ని గుర్తుచేసుకొంటూ సాగుతున్నాం. కామ్రేడ్ యాంగ్‌కిగాని, నాకుగాని స్పష్టంగా ఎటు కదలాల్సింది అంతుచిక్కటంలేదు- మాలో మేము కిందామీదా పడుతుంటే, చెన్ మాత్రం మొండిగా ముందుకే సాగుతున్నాడు.

"ఏమోయ్, జాగ్రత్త సుమా! చిన్న గుంట ఏదో వున్నట్టుంది. అటుపక్క అడుగేస్తావేమో, జాగ్రత్త పెద్ద కందకంలో పడిపోగలవ్" అంటూ నేనే అప్పుడప్పుడు హెచ్చరిస్తున్నాను.

యిదేమీ లక్ష్యపెడుతున్న ధోరణి కనిపించలేదు_ ఆ మొండిధైర్యం చూస్తుంటే అంతమంచి గైడ్ దొరికినందుకు ఎంతో సంతోషించాం. మెరుపుల వెలుగుల్లో మెరిసి పోతున్న అతని బిరుసెక్కిన స్వరూపాన్ని చూస్తుంటే ఎంతో జాలి, అమితమైన ప్రేమ కలుగుతున్నాయి. అతను అందుకు తగ్గవాడే!

ఇలా ఆలోచిస్తూ పోయిపోయి, చూసేసరికల్లా శత్రువుకి చాలా సమీపంలో వున్నట్టు అనిపించింది. బురదలో అడుగుతీసి అడుగేస్తు సమీపిస్తున్న ధ్వని చేరువవు తోంది_ పక్కకి అడుగేసి రక్షణ చూసుకొనేలోపే, పెద్ద మెరుపు మెరవటం, ఎవరెక్క డుంది అర్థమైంది. 'తిరోగామి దళా' లనబడే సుమారు 20 మంది దుర్మార్గులు, వాళ్ళ మధ్య ఖైదీలుగా 12 మంది దాక మనవాళ్లు_ సుమారు పదడుగుల దూరంలో ఎదురు బొదురుగా వున్నాం- అంతే. క్షణం విశ్శబ్దం తర్వాత తుపాకీ కాల్పులు మొదల య్యాయి. రివ్వున గాలిని దూసుకొంటూ తూటాలు వచ్చి పడుతున్నాయి- వెంటనే ముందుకురికి కాల్పులు ప్రారంభించాం- అంతా గందరగోళం. అరుపులు, ఏడుపులు, కేకలు, కాల్పులు, తలమీదుగా తూటాలు దూసుకెళుతున్న ధ్వనులు.... యింతలో ఎవరో చెంగున నన్ను పక్కకి లాగేశారు_ ఆ కటిక చీకటిలో మిత్రువో, శత్రువో కూడా తెలియని స్థితి. వెనుక నుంచి మాటలు విన్పించాయి:

"ఎవరికోసం వెదుకుతున్నావు? మూర్ఖుడా. అంతా తప్పించుకు పోయారు! మన ఖైదీలని కూడా పోగొట్టుకున్నాం" అంతే, ఒకేఒక్క కాలుపుకి మిగిలినవాడొక్కడూ ఒరిగిపోయాడు- అప్పు డర్థమయింది! పోయిపోయి నేను శత్రుమూకల మధ్య చిక్కుబడిపోయానని.

## III

ఈ కాల్పుల హడావుడిలో మేం ముగ్గురం తలొకదిక్కు అయిపోయాం. మెరుపు మెరిసి నప్పుడల్లా ఆశగా చుట్టూ చూసేవాణ్ని, వాళ్లకోసం. ముందే అనుకొన్న సంకేతాలద్వారా వాళ్ళను పిలుస్తూ, నడకసాగించాను. ఒకళ్ళ తర్వాత ఒకళ్ళం ఎలా గైతేనేం కనిపించారు. చెక్కుచెదరకుండా వున్నాం. తిరిగి అతి కష్టంమీద ముగ్గురం ముందుకు సాగుతున్నాం.

గాలి హోరు తగ్గి, వర్షం తగ్గుముఖం పడుతోంది- ఆకాశం అలానే మేఘావృ తంగా వుంది- నక్షత్రాల కాంతి కూడా లేదు- వర్షానికి కప్పలు బెకబెక లాడుతూ సందడిగా వున్నాయి. పొలాల కుంటలు వర్షపు నీరుతో ముంచెత్తాయి. వున్నట్టుండి

దారి తప్పామేమోనని పించింది మాకు- చుట్టూరా నడుమెత్తు పెరిగిన అడవిరెల్లు, మిణుకుమిణుకుమనే మిణుగురులు. చూడబోతే ఆపాటికే మేమున్నది చిత్తడి ప్రదేశం.

నెమ్మదిగా ముందుకు సాగుతున్న చెన్, ఎందుకో ఆగిపోయాడు.

"అరే బాప్! ఎక్కడున్నాం మనం? ఏమీ అర్థంకావటం లేద" న్నాడు.

"ఏమిటి? నీకు అంతుపట్టటం లేదా!" అరిచాడు యాంగ్.

"యింత గందరగోళంలో ఎలా చిక్కుబడిపోయాం? దారి తప్పామనుకొంటాను. ఏం అంతేనా? పోనీ తూర్పు, పడమరలుగా ఎటుపోతున్నామో అయినా కనీసం చెప్ప గలవా?"

"నేననుకోవటం వెళ్ళాల్సిన తూర్పు దిక్కుగానే సాగుతున్నామని- అయినా ఖచ్చితంగా చెప్పలేను కామ్రేడ్స్. ఈ చిత్తడి నేలని యింతకుముందెప్పుడూ చూడలేదు."

"ఛట్! మనం పోతోంది దక్షిణ దిక్కుగా తెలుసా?" అన్నాడు యాంగ్, కోపంగా.

"ఏమో, ఏమీ చెప్పలేకపోతున్నాను- ఆ వెధవలతో జరిగిన ఘర్షణలో తలో దిక్కు అయాం. దాంతో వున్నచోటినుంచి ఎటుగా కదిలామో అంతుపట్టటంలేదు" అన్నాడు చెన్ చాలా విచారంగా.

దారి తప్పామనుకొనే సరికి మాలో ఆందోళన మొదలయింది- చెన్ మీద, యాంగే విసుక్కోటం చూస్తుంటే, జరిగినదానికి చెన్ బాధ్యుడుకాడనిపిస్తోంది। ఆ చిమ్మ చీకటిలో, కొత్త ప్రదేశం, పైగా జరిగిన ఘర్షణ ఎవరికైనా దారితప్పే అవకాశముంటుంది- ఏమైనప్పటికీ, విసుక్కొన్నంత మాత్రాన సమస్య పరిష్కారం కాదుకదా.

"పోనీ గాలివీచే వైపునిబట్టి, ఎటుగావెళ్తున్నామో తెల్సుకోలేమా!" అన్నాను.

నమ్మండి, నమ్మకపోండి- వున్నట్టుండి గాలివీచటం ఆగిపోయింది. పోనీ చెట్లున్నాయేమోనని చుట్టూరాచూశాం- ఆకుల కదలికనుబట్టి ఏమైనా తెల్సుకోగలమేమోనని. చుట్టూరా దట్టంగావున్న రెల్లుదుబ్బులు మినహా మరేం కన్పించటంలేదు. అప్పుడప్పుడు పైకి చూస్తూ, ఏదైనా నక్షత్రం కనపడితే, అలాగైనా దారి తెల్సుకొందామనుకొంటే, అదీ ప్రయోజన శూన్యమయింది. ఆదుర్దా ఎక్కువయినకొద్దీ మరింతగా తికమకపడటం మినహా, ఆలోచించలేము.

'క్షణం ఆగండి' అన్నాను- "యిక యీ చీకట్లో తడుములాట ఆపుదాం. తప్పు దిశగా సాగటం మొదలెడ్తే, పరిస్థితులు మరింతగా అధ్వాన్నమవుతాయి."

"ముందుకి పోక, వెనక్కి మళ్ళక ఏం చేయాలి ?" అన్నాడు యాంగ్.

"నిజమే ! కాని కాసేపు ఆగటం నయమనిపిస్తోంది. కొంచెంసేపట్లో వెలుతు రొచ్చేలావుంది. అప్పుడు ఎటువెళ్ళాలో తెల్సుకొని, ముందుకు సాగుదాం. చెడు వూహించుకొని అదుర్దాపడొద్దు- మనకింకా కొద్దిపాటి మంచిఅవకాశాలున్నాయనిపిస్తోంది.

పైకి అనటం అయితే అలా అన్నాను కాని, నాకింకా పూర్తి నమ్మకం కలగ లేదు. నన్ను నేను ఓదార్చుకొంటున్నాను అలా అంటూ. అయితే శత్రువు ఆక్రమిత ప్రాంతంలో లేమనిగాని, వెలుగుతో వాళ్ళు మమ్మల్ని చూస్తే మేం బయటపడగలమని గాని నేననటం లేదు. కాని చేసేది లేక కాసేపు విశ్రమించాం. సుళ్ళుతిరుగుతు పారుతున్న నీళ్లు, చెరచెరా పోతున్న నీటి పాయలు, బెకబెకలాడే కప్పలు- యిదీ మా చుట్టూ పరిస్థితి.

ఎందుకనో యాంగ్‌కి కోపమొచ్చినట్టుంది, విసుగ్గా విసిరేస్తున్నాడు మట్టిని ముద్దలుచేస్తూ. 'వెధవ చీమిడొకటి' అంటూ గట్టిగా చీదేశాడు. పసివాడ్ని ఎలా పుత్సాహపరచాలా అని నేను ఆలోచిస్తున్నా. కిక్కురుమనకుండా కూచున్నాడు, పాపం చెన్- శ్వాస గట్టిగ పీలుస్తున్నాడు.

"చేతులు కాల్చుకోటం, ఆకులు పట్టుకోని చంటాడిలా ఏడవటం- ఛీ - ఛీ...." అన్నాడు యాంగ్.

ఆ మాటతో నిజంగానే ఏడుపు మొదలయింది చెన్‌కి. మోచేత్తో పొడిచాను యాంగ్‌ని, ఏమనద్దంటూ. ఆ ఘర్షణ జరక్కపోతే, దారితప్పే వాళ్లం కాదుకదా ! పసివాడి దేముంది. ఎన్ని చిక్కు లెదురయినా, స్థిమితంగా పోరు కొనసాగించాలని కాకపోతే, యింటి నుంచి బయటకు కదలాల్సిన అవసర మేముంది ? ఈ ఆలోచనేమీ యాంగ్‌కి వున్నట్టు కన్పించటంలేదు. చితుకుల మంటలాంటిది యాంగ్ కోపం. కాస్త తగ్గగానే తిరిగి ప్రశాంతంగా మారిపోతుంటాడు.

"సరే, అయిందేదో అయింది- కాసేపైనా విశ్రాంతి తీసుకొందాం" అన్నాడు. చెన్ మాట్లాడకుండా చుట్టూరా చూస్తున్నాడు। వెల్తురు రావటానికి యింకా ఆలస్య ముంది- యాంగ్‌కి గురక మొదలయింది.

శత్రువు వ్యూహంలో చిక్కుకుపోయి రోజులతరబడి వున్న ఘటన లున్నప్పటికీ, యిప్పటి ఆందోళన, బాధ్యత మున్నెన్నడూ లేవు. ఈ ఆలోచన రావటంతో కామ్రేడ్స్ మా, లీ లను పోగొట్టుకొన్న వైనం, మొదటి సాయుధప్రతిఘటన పటాల విధ్వంసం,

ప్రజలపై 'తిరోగామి బందిపోటు'ల అమానుషత్వం, మమ్మల్ని సమూలంగా ఏరివేయా లనే పథకంతో రాబోవుతున్న కొమింగ్‌టాంగ్ మూకలు.... ఒక్కతడవగా స్మృతి పథంలో మెదిలారు- మనసు కకావికలయింది.

## IV

నెమ్మదిగా కునుకుపట్టింది- చెన్ మోచేత్తో పొడిచేసరికి వులిక్కిపడి లేచి కళ్లు నులుముకుంటూ చుట్టూచూశాను. కాకులు కావ్‌కావ్ మంటున్నాయి- యింకాసేపట్లో అరుణోదయ మయ్యే చిహ్నాలు కనబడుతున్నాయి- క్షితిజంపై వెలుగు చారికలు పర్చు కొంటున్నాయి.

నా చేయి గుంజుతూ చెన్, "కమాండరు, చూడండి యిటుగా- నేననుకొన్న తట్టే తూర్పుదిక్కు సరిగ్గా- మనం వెళ్ళాల్సిన చోటికి చేరువలోనే వున్నామన్న మాట" అన్నాడు- నిజమే. చెన్ అంచనా సరి అయిందే.

"అలాగైతే మనం ఎక్కడున్నామో చెప్పగలవా ?" అన్నాను.

మేమున్నచోట చీకటింకా దట్టంగా వుంటంతో రూఢిగా చెప్పలేక పోతున్నాడు. నెమ్మదిగా అరుణరేఖలు విచ్చుకుంటున్నాయి- చల్లని గాలి, కుంటల్లో పారే నీరు, ఆవుదూడల పరుగులు, పక్షుల కూజితాలతో అరుణోదయ వాతావరణం ఆహ్లాదంగా వుంది ! ఏదో వింత ధ్వని ఎక్కడి నుంచో మా చెవుల దూరుతోంది.

'ఏమిటా ధ్వని ?' అని అడిగాను.

"సముద్రపు వొడ్డుకి ఎగసిపడే కెరటాల ధ్వనిలా వుంది" అన్నాడు యాంగ్.

"కాదు కామ్రేడ్స్" అన్నాడు చెన్. "సముద్రానికి చాలా దూరంలో వున్నాం. చూడబోతే మనం నదికి చాలా చేరువలోవున్నట్టుంది. తప్పని సరిగా అది నదివరదతో పరవళ్ళు తొక్కుతూ పారే సడి !"

యింతమంచివార్త యింత త్వరలో వింటాననుకోలేదు- 'నిజమేనా' అంటూ అడిగాను- 'పట్టి పగటికల' అంటూ కొట్టిపారేశాడు యాంగ్.

"కాదు కామ్రేడ్స్, నామాట నమ్మండి. నదీ ప్రాంతంలో పుట్టి, నదివొడ్డున పెరిగాను- నా చెవులు నన్ను మోసగించలేవు- నిశ్చయంగా అది నదీప్రవాహ ధ్వనే."

కనుచూపు మేరలోని పల్లె క్రమంగా ఒక రూపు తీసుకోటం కనబడుతుంది- తెలతెలవారబోతున్న ఆవేళలో ఎదురుగావున్న ఆ పల్లె, చుట్టూరావున్న చెట్లు, చేమలు

పొలాల మధ్యగ మేమున్న చిత్తడి ప్రదేశం, దక్షిణవైపుగా వున్న పూలతోట ఒకటొ కటే క్రమంగా కనిపిస్తున్నాయి.

“కమాండరు యో! అటుచూడండి_ అల్లదే ‘లీ’ ప్రాంతం” అంటూ పూర్తి విశ్వాసంతో పరిసరాలను పరిచయం చేస్తున్నాడు_ ‘హెయ్, హెయ్’ అంటూ ఆనం దంతో వుక్కిరిబిక్కిరవుతూ, “మా యింటికి చాలా చేరువలోనే వున్నాం కామ్రేడ్స్- అదుగో, అటు చూడండి.... అల్లదే ఆ కన్పించే పూలతోట, ఆ లోపలి యిల్లు.... అక్కడే మా నాన్న వాళ్లు వుండేది. యిక్కడికి చాలా చేరువలోనుంచే మన పార్టీ రహస్య కార్యకర్తలు నదినిదాటి ఆవలితీరం చేరుతారు. ఆ కనబడే విల్లో చెట్లున్నాయ్, చూస్తున్నారా? ఆ పక్కనే రహస్యంగా దాచివుంచుతాము చిన్న బోటుని. ఎప్పుడూ సిద్ధంగా వుంటుంది. అమ్మయ్య! యింకేం ఫర్వాలేదు- మీరు నదిని దాటొచ్చు. మనం దారి తప్పలేదు- అవునా?” అనంటూంటే, తన కప్పచెప్పబడిన పనిని నెర వేర్చగలుగుతున్నాననే తృప్తి అతనిలో అణువణువునా ప్రస్ఫుటమవుతోంది. యాంగ్ అమాంతంగా చెన్‌ని అక్కున చేర్చుకుని “అమ్మ పిడుగా! నిజమేనే_ యింత మంచి గడుసుబుల్లోడ్ని నేనెరగ” నంటూ హుషారు చేశాడు. తను యిదేమీ పట్టనట్టుగా చెట్ల దగ్గరికి దూకేశాడు_ తీరా వెళ్తే అక్కడ బోటు లేదు_ వరదకి కొట్టుకుపోయినట్టుంది. నది మామూలుగ వుండేదానికంటే మూడింతలువుంది_ వరకట్టలు దాటి ప్రవహిస్తోంది నది. ప్రవాహమధ్యం విపరీతమైన వడితో సుళ్ళుతిరుగుతూ పారుతోంది_ తూర్పు తీర వరకట్టలు కూడా ఆ తాకిడికి గురవుతున్నాయి. ఆఖరిక్షణంలో వాటిల్లిన యీ విపత్తుకి బుర్ర పాడైపోయింది.

‘మీకు ఈత వచ్చా?’ అనడిగాడు యాంగ్. నదీ ప్రవాహం చూస్తుంటే ఎంత పెద్ద ఈతగాడైనా వెనకడుగువేయాల్సిందే_ పిల్లకాలువల్లో యీదే నాబోటిగాడి సంగతి వేరే చెప్పక్కర్లేదు. ‘సరి సరి.... నాకూ యీత రాదు. మరి నీ సంగతేమిటి?’ అన్నాడు చెన్‌ని.

“నామటుకు సరే! కాని దానివల్ల ఏం ప్రయోజనం? నాతోపాటుగా మిమ్మల్ని తీసుకుపోలేను కదా! కొమింగ్‌టాంగ్ మూకలు వొడ్డునున్న తెప్పలన్నీ తగలేసి నట్టుంది_ అలా అని యిక్కడే వుంటే మరింత ప్రమాదంలో పడొచ్చు చెప్పండి, ఏంచేద్దామంటారో?”

ఏం తోచలేదు మాకు.

“పోనీ ఒకపనిచేస్తే!”

ఏమిటన్నట్టుగా చూశాం.

"ఏటికి ఎదురీదే గజఈతగాడు మా నాన్న. మీరు మా యింటి కొచ్చేట్లయితే, ఏదో ఒకటి చేయొచ్చు. మనలో మిగిలినవాళ్ళని ఆయన తప్పనిసరిగా ఆవలికిచేరుస్తాడు. రండి కామ్రేడ్స్, పోదాం." సమయానికి అంతమంచి ఆలోచన తట్టినందుకు చెన్‌ని మెచ్చుకుంటూ, యింటివైపుగా బయల్దేరాం. నది దాటాక అక్కడి రక్షణ సంగతి తర్వాత చూసుకోవచ్చు.

## V

రాత్రి కురిసిన వర్షం చినుకులు చెట్ల ఆకులమీద ముత్యాల్లా మెరుస్తున్నాయి. సన్నని దారిగుండా పోయిపోయి, తోటదాటి ఓ పూరిపాక తలుపుదగ్గరికి చేరాం. 'కుయ్' మంటూ విరుచుకుపడింది కుక్క. 'టైగర్' అంటూ చెన్ పిలిచేసరికి తోకాడిస్తూ ఆహ్వానం పలికింది! యింతలో కీచుమంటూ తలుపు తెరుచుకొంది. ఆ సందులోంచి ఒక నిశితమైన చూపు మమ్మల్ని పరికించింది! 'నాన్నా' అంటూ పిలిచాడు చెన్.

క్షణం నివ్వెరపోయినా, వెంటనే తేరుకొని "రండి, రండి.... లోపలికొచ్చేయండి" అంటూ లోపలికి దారితీశాడాయన. లోపలంతా గందరగోళంగా వుంది. సామానంతా చెల్లాచెదురయింది. నీళ్ల జాడి బీటలువారి, వంట సామాగ్రి పగిలిపోయి, ఆహార పదార్థాలు నేల కుమ్మరించి, బట్టలు పీలికలు పీలికలయి వున్నాయి. పాలిపోయిన మొహంతో చెన్ లోపలి గదిలోకి ఒక్క గంతేశాడు.

"అమ్మ.... అమ్మ ఏది నాన్న?"

తలుపుకి చేరగిలపడినవాడల్లా, తలఎత్తి ఆవేశంగా అన్నాడు "యింకెక్కడి అమ్మ బాబు, వాళ్ళు యీడ్చుకెళ్లిపోయారు. ఆ బందిపోటు వెధవలు అమ్మను, చిన్నోడు 'ఛియా'ని లాక్కెళ్లి పోయారు." చెన్ కుప్పకూలిపోయాడు. నూతిలోంచి వచ్చినట్టు వస్తోంది మాట.

"ఎప్పుడింత ఘోరం జరిగింది?"

"యివాళ్టికి 5 రోజులవుద్ది" అన్నాడాయన. గుండె చిక్కబట్టుకొంటూ జరిగిందిలా చెప్పాడాయన.

ఆ వూళ్లోనే స్థానికంగా వుంటున్న ఓ వ్యక్తి ద్రోహిగామారి, చెన్ కుటుంబం గురించిన పూర్తి భోగట్టా శత్రువుల కందచేశాడు. చెన్ విముక్తి సైన్యంలో చేరి పని చేస్తున్నాడని, నది యీవలికి, ఆవలికి రహస్య కార్యకర్తలను తరలిస్తున్నాడని 'తిరో

గామి మూకలకి తెలిసిపోయింది. వెంటనే యింటిమీద దాడిచేసి, అడ్డమొచ్చిన ప్రతి దానిని ధ్వంసం చేసి, వున్న ముగ్గురినీ జిల్లా వుపకార్యాలయానికి తీసుకెళ్ళారు. అక్కడ విపరీతంగా హింసించి, ముసలాయన్ని మటుకు వదిలిపెట్టారట. చెన్ వచ్చే దాక యింటివద్ద వుండి, రాగానే చెన్‌చేత రహస్య నిర్మాణంలో పనిచేసే వాళ్ళందర్నీ వాళ్ళకు వొప్పచెప్పేలా వొప్పించాల్సిందిగా చెప్పి పంపారాయన్ని. తన కుటుంబ సభ్యుల్ని విడిపించుకోవటానికిగాను యిది ఆయన చెల్లించాల్సిన మూల్యం.

నేను, యాంగ్ కొయ్యబారిపోయాం. విచారంగా కూచున్న చెన్, పెదవికొరుక్కుంటూ, తండ్రి కళ్ళలో కళ్ళుపెట్టి సూటిగా చూస్తూ అన్నాడు.

"సరే, ఏం చేయాలనుకొంటున్నావ్?"

"నేను నిన్ను యిక్కడికి ఎలాగ పిలిపించాలని చూస్తున్నాను."

"ఎందుకు? పిలిపించి ఏం చేద్దామని?"

"అరే బాబు! అయిదు రోజులుగా రాత్రి, పగలని లేకుండా, అక్కడ మీ అమ్మని, తమ్ముడిని దూలానికి వేలాడదీసి బాధిస్తున్నార్రా. మరి నేను నీకోసం ప్రతిచోట వెతుకు...."

"అందుకని, పాపం నువ్వు నాకోసం గాలించలేక నానాఅవస్థ పడుతున్నావన్న మాట. ఏం, అంతేనా?"

చెన్ గొంతు చాలా కరుగ్గా మారిపోయింది.

"అవున్రా" అనంటూంటే, ముసలాయన గొంతు బాధ, కోపంతో పూడుకుపోయింది.

"అవున్రా, అవునొరే. నీకోసమే నేను ప్రతిచోట గాలిస్తున్నాను. ఎందుకో తెలుసురా? చెప్పమంటావా? నీఅమ్మ, అయ్య, తమ్ముడి ప్రాణాల గురించి గుర్తు చేయటానికనే కాదురా, విముక్తి కోసం పోరాట ఎర్రజెండాను ముందుకు తీసుకెళ్తున్న వేలాది మంది వీరుల, వీరుల కుటుంబాల గురించి గుర్తుచేయుటాని కొరే. ఆ లంజాకొడుకులు ఎంతమంది ప్రాణాలు తీశారో తెల్సురా? అబ్బా.... అరే బాబు! యిప్పుడు చెప్పరా. నాలోరగిలే కసి, పగ తీరాలంటే, దెబ్బకు దెబ్బ ప్రతీకారం తీర్చుకోవాలంటే, నీకోసం కాక ఎవరికోసం ఎదురుచూడన్రా? చెప్పరా సిన్నోడా చెప్పు నీవు సైన్యంలో చేరతా నన్నప్పుడు, యిందుకోసం కాకపోతే, మరెందుకు ఒప్పుకున్నాననుకొంటున్నావు? రకతం చూసినవాడి రకతం చూడాలిరా............"

ముసలాయన కోపంతో, ఆవేశంతో పగతో, నిలువెల్లా ఒణికిపోతున్నాడు. కళ్ళు ఎరుపెక్కాయి. అక్షణాన ఆయనమొహంలో, విముక్తి కోసం సాగిపోతున్న వేలాది మంది వీరుల దృఢదీక్ష, పట్టుదల, కసి కనిపించాయి- క్షణకాలం పట్టింది మాకు అర్థమవడానికి.

చాల సగర్వంగా చూశాడు చెన్ మా తట్టు. 'చూశారా మా నాన్న ఎలాంటి వాడో' అన్నట్టుగ. ఒక్కవూపున వెళ్లి తండ్రిని కౌగలించుకొన్నాడు- ఆవేశంతో పిడి కిళ్ళు బిగిస్తూ, "వీడున్నది అందుకే నాన్న" అన్నాడు.

"చాలా సంతోషంరా చెన్.... రెండు రోజులుగా నీకోసం చూసి, ప్రయోజనం లేకపోయింది" అంటూ కొడుకుని మరింతగా దగ్గరకి చేర్చుకుంటూ, "యింక అలా చూస్తూ కూచోలేకపోయానురా- కమాండరు 'మా' వుండే చోటు తెల్సు కాబట్టి, సమా చారం అందచేద్దామని వెళ్ళాను- నేను వెళ్ళేసరికే అంతా అయిపోయింది. ఆయన రహస్య స్థావరం శత్రువుకి తెలిసిపోయింది- అరే బాబు.... మనవాళ్లని పట్టుకోవటా నికి వెధవలు వెయ్యి మంది ఒక్కపెట్టున దాడి చేశార్రా.... అయితేనేం.... పులిబిడ్డలు వీరోచితంగా ప్రతిఘటిస్తూనే ఒక రోజంతా స్థావరాన్ని కాపాడుకో గలిగారు- ఆఖరి బులెట్ దాక శత్రువు నెత్తురిని పారిస్తూనే వున్నారు- వాళ్ల చేతుల్లో పడటం యిష్టం లేక ఆత్మాహుతయిపోయారు."

"నేను వెళ్ళేసరికే వాళ్ళ శరీరాలు వీధుల్లోకి విసిరేయబడివున్నాయి. అరే బాబు, ఓహ్.... ఏం వీరులురా మనవాళ్లు. దళంలోని ప్రతి వ్యక్తి ఆఖరి క్షణం దాక పోరాడు తూనే ఒరిగిపోయారు- వాళ్ల సాయుధ పోరాట అమరవీరులురా !"

జరిగిందంతా చెబుతుంటే చూశాం, మొదటిసారిగ ఆయన కళ్లలో నీళ్లు చిప్పిల్లటం. నెమ్మదిగ ఆయన చెంతజేరాం.

యాంగ్ ఆయన చేతిని చేయిలోకి తీసుకొంటూ అన్నాడు, "ప్రియమైన కామ్రేడ్, మేమింకా బ్రతికే వున్నాం- మీరు నిరాశ పడాల్సిన పనేలేదు. ఆ పటాలంగాని, కామ్రేడ్ మా, లీలు లేరనుకోవద్దు- నష్టాల్ని విజయాలుగా మార్చుకొంటూ, పార్టీమీద పూర్తి విశ్వాసంతో, తిరిగి పటాలాన్ని పునర్నిర్మించటానికే మేమొచ్చాం."

ఆయన కళ్ళు ఆనందంతో మిలమిలా మెరిసాయి. నిజమా అన్నట్టు మాతట్టు చూశాడాయన.

"అయితే నదినిదాటి తూర్పుతీరం చేరాలన్న మాట."

"అవును నాన్న. ఆ పనిమీదే నేను మన కామ్రేడ్స్ వెంటవొచ్చాను. పార్టీ వాళ్ళు నన్ను అందుకే పంపించారు. నదిని దాటుదామంటే, వున్న ఒక బోటు కాస్త ప్రవాహ వేగానికి కొట్టుకెళ్లిపోయినట్టుంది_ ఏం చేయాలో ఆలోచించు."

మమ్మల్ని ఒకపరి కిందకి, మీదకి చూశాడు ఆయన.

"సరే, అలాగే చేదాం_ కానీ ఏదైనా త్వరగా జరిగిపోవాలి! ఎందుకంటే నిన్ననే పటాలంనించి వేరుపడ్డ మన వాళ్లిద్దరు వెదురుపొదళ్లలో చిక్కుబడి పోయిన విషయం ఆ మూకకి తెలిసి, వచ్చి మీదపడ్డారు_ వాళ్లిద్దరయితేనేం, కామ్రేడ్స్ గదా! వాళ్లని రోజంతా నిలవేయ గలిగారు. వాళ్ల దగ్గర మందుగుండు అయిపోగానే, అక్కడి కక్కడే తుపాకులు నాశనంచేసి, నదిలోకి దూకేశారు_ యింతలో మీరొచ్చారు. మరింక మన ప్రయత్నాలేవో త్వరగా చేసుకోవాలి!" అంటూ 'నది దాటాలంటే బోటు కావాల్సుంటుంది కదా' అన్నాడు.

"బోటు వరదకి కొట్టుకెళ్లింది_ నది వరదతో వుప్పొంగి పోతోంది_ అయినా సరే యివాళే, యీ క్షణానే దాటేయ్యాలి!" అన్నాను. ఏం చేదామన్నట్టు చూశాడాయన. ఎలా అన్నట్టు చూశామాయనతట్టు. తలుపు తెరచి కనిపించే దూరపు ప్రవాహంకేశ్లి చూశాడాయన.

"మీలో పోనీ ఏ ఒక్కరికయినా యీత వొచ్చా?"

"మామూలు పిల్లకాలువలో అయితే తంటాలు పడగలమేమో కాని, ఈ వరద గోదారిలో మావల్ల కాదు కామ్రేడ్." యీ మాట అనాల్సి వచ్చినందుకు సిగ్గుతో చచ్చిపోయాం.

మారు మాటాడకుండా, గదిలోకి వెళ్లి సారాయి సీసా తెచ్చాడు_ "తీసుకొండి కామ్రేడ్స్. ఈ చలిలో, మంచులో ఏటికి ఎదురీదాలంటే మనకు యీ మాత్రపు వేడి అవసరం" మంటూ మా కందించాడు. వెంటనే పూర్తిచేసి, నలుగురం బయలుదేరాం. మాకు అర్థం కాలేదు కాని, చెన్ మటుకు నెమ్మదిగా అన్నాడు_ "ఆయన గజయీత గాడు! అంతే అయుంటుంది_ బహుశా మిమ్మల్నిద్దర్ని బుజాల మీదేసుకుని ఈదేయొచ్చు."

అలాంటి తండ్రి తనకున్నందుకు చెన్ ఆనందంగా వున్నాడు_ ఆ క్షణాన మాకు అలానే వున్నా, మరుక్షణమే చిత్రవధ చేయబడుతున్న చెన్ కుటుంబం గుర్తుకొచ్చే సరికి మనస్సు చివుక్కుమంది_ "వీళ్లకు ఏం చెయ్యబోతున్నాం? మావల్ల ఏమవుతుంది?" అనిపించింది. ఏమిటన్నట్టు చూశాడాయన మావైపు.

"మీభార్య....పిల్లవాడు"

మాటపూర్తయి కాకముందే,ఆయన మమ్మల్ని ముందుకునెట్టి వళ్ళుబిగిస్తూ, "పదండి ముందుకు" అన్నాడు.

## VI

సూర్యోదయమయి పూర్తి వెలుగొచ్చింది. అలలమీది నురుగు ప్రవాహవేగానికి ఎగిరెగిరి పడుతోంది. చెవులుచిల్లులుపడి పోయేలావుంది. చప్పుళ్ళకి, ముసలాయన మాటల్లు, ప్రవాహంతట్టు తేరిపార చూశాడు.

"కామ్రేడ్స్, మీలోఒక్కొర్ని అవలికి చేరుస్తాను. ఐతేఒకవిషయం మటుకు జాగ్రత్తగా గుర్తుంచుకోండి. నీళ్ళలోకి దూకింతర్వాత, వెనక్కి పక్కలకు చూడటం కాని, వ్యాపకాలకు లోనుకావటంకాని కూడదు. అర్థమయిందా? మీలో ఎవరు ముందొస్తారో,రండి"

యాంగ్‌ని ముందుకి తోసాను వెళ్ళమంటూ,

"నువ్వు, చెన్ బయలుదేరండి. నేనువొడ్డునేవుండి, మీకురక్షణ విషయం చూసుకొంటాను."

"కాదు.కాదు. ముందు మీరిద్దరూ బయల్దేరితేనే బాగుంటుంది" అన్నాడు యాంగ్.

"కాదు. కామ్రేడ్‌చెన్, మీరుబయలుదేరి తీరాలి" అనటం తప్పనిసరియింది. అంటే ఆజ్ఞాపూర్వకంగానే నేనుచెప్పాను.

యింతలో దూరంనుంచి తుపాకీకాల్పులు వినిపించాయి. నోరువిప్పి ఏదోఅన బోయేలోపలే, ముసలాయన యాంగ్‌రెక్కపుచ్చుకు నీళ్ళలోకి దూకేశాడు.

"నువ్వెళ్ళలేదేం చెన్" అంటుంటే, వినిపించుకోకుండా, కోపంగా వొడ్డు వెంబడి పైకివెళ్ళిపోతుంటే, చేసేదిలేక నేనువెనకే నడిచాను దూరంగా మేమున్నచోటికి పడమటి దిక్కునుంచి సుమారు ఏడెనిమిదిమంది రోడ్డుమీదుగ యిటేరావటం కనిపించింది. పొగమంచులో మేముసరిగా కనబడే అవకాశంలేదు.

దగ్గర్లోనేవున్నచిన్న కందకంలోదూకి రక్షణతీసుకొన్నాం. మాతో టైగర్ కూడా, నదిలో ముసలాయన యాంగ్‌ని ముందుకునెట్టూ ప్రవాహానికి ఎదురీదుతున్నాడు. ఒక్కొతడవలేచిపడే పెద్దఅలలకి కనబడక పోయినా, మామూలుగా వొడ్డునుంచిచూస్తే కనబడుతూనేవున్నారు. మళ్ళీ రోడ్డుమీదికిచూశాం. అగుంపుదారిలో వస్తూవస్తూ చెన్‌యింట్లోకి దూరటం కనిపిస్తోంది. కిందిపెదవిని మునిపంటితో అదుముతూ, వాళ్ళని పరీక్షగా

గమనిస్తున్నాడు చెన్. బహుశా ముసలాయనకోసం వెదుకుతుండొచ్చు. కనబడక పోయే సరికి, వాళ్లు వెతుక్కుంటూ సరిగ్గా మేమున్నచోటికి రావచ్చనిపించింది. వాళ్లువచ్చే లోపలే, యూంగ్ నదిదాటేసేయాలి. చాలా అవసరం.

యూంగ్ అవలిగట్టుకి సురక్షితంగా చేరేదానికేమేం చెయ్యగలిగినంతా చెయ్యాల్సిందే. "మొదటి సాయుధ ప్రతిఘటనా" దళానికి జీవంపోసి, తిరిగి సరిహద్దు ప్రాంతాన్ని మాఆధీనంలోకి తెచ్చుకోవాలంటే మావంతు కర్తవ్యం చాలావుంది. యిలా ఆలోచిస్తూనే చెన్ తట్టు చూశాను. చెన్ వాళ్ల రాకపోకలని చాలానిశితంగా గమనిస్తున్నాడు. చంటివాడు కనుక మనస్సు ఏమన్న బాధ పడుతున్నదేమోనని వుషారుచేద్దామనుకుంటే, అతనే నన్ను సమాధాన పరుస్తున్నాడు.

"చూడండి కమాండరు. సగానికిపైగా వాళ్లునదిని దాటేసుంటారు. ఏటికి ఎదురీత మావాన్నకి ఓలెక్కలోదికాదు. మరోక్షణం అటోయిటోగా వచ్చేస్తాడు. మిమ్మల్ని కూడా దాటేయిస్తాడు."

ఆక్షణంలోకూడా అలా ఆలోచిస్తున్నాడంటే, చెన్‌ని చంటివాడంటారా? ఎంత ఆత్మవిశ్వాసం, పట్టుదల, విప్లవ ఆకాంక్షగల మనిషో మీరేచెప్పండి? టైగర్ కోపంగా అరుస్తుంటే తలఎత్తిచూశాం. మేమొచ్చిన మార్గాన్నే వాళ్లురావటం కనిపిస్తోంది. టైగర్ అరుపు ఎక్కువయింది.

"ష్! దాన్ని ఆపండి, అరవకుండా!" అంటూ టైగర్‌ని అందిపుచ్చుకొని కందకంలోకి లాగేశాడు. యిష్టంలేనట్టు మొహంపెట్టి, గమ్ముగనూరుకుంది. యిళ్ల పై కప్పుల్లోంచి పొగ పైకి చిమ్ముతోంది. పల్లెకారులు వంటల్లో సతమతమవుతున్నట్టుంది. గాలి మళ్లీ ఉధృతంగా వీస్తోంది. తుఫాను వచ్చే సూచనలు కనబడుతున్నాయి. శత్రుమూక స్పష్టంగా కనిపిస్తున్నారు. భూస్వాములు, వాళ్ల తొత్తులు తుపాకులు గట్రా పట్టుకొనొస్తున్నారు. "అటు చూడండి, వాడే ద్రోహి" అంటూ చెన్ వాళ్లలో ఒకతణ్ణి చూపించాడు.

"ఎవరు వాళ్లలో ద్రోహి?"

"పొట్టిగ ముందు వరుసలో నిలబడ్డాడే, చప్పనాతి వెధవ, వాడే ద్రోహి. పేరుకు పూరిపెద్ద. నన్నూ, మా కుటుంబాన్ని నాశనం చెయ్యాలనుకొంటుంది వాడే" అంటూ, తుపాకీ ఎత్తి వాడి గుండెలకి గురిచూస్తున్నాడు. మొత్తం గుంపుని మావైపుగా తీసుకొస్తున్నాడు. సుమారు నలభై, ఏభై మంది వుండొచ్చు. వాళ్ల అడుగుల సడితో పాటు, అస్పష్టంగానైన వాళ్ల మాటలు వినవస్తున్నాయి.

"వాడున్నాడు చూశారు, కుర్రవెధవ, ఒహుశ ఎనిమిదివ మార్గసైన్యంలో చేరుండచ్చు. నేనప్పుడే చెప్పాను మీకు. ఆలస్యం చేయకండయ్యా, దొరకనే దొరికారు, ముత్తాన్ని సజీవంగా పాతెయ్యమని— నా మాట వింటేనా మీరు? అవకాశ మిస్తూనే, ఎరవేసి చేపను పడదామన్నారు— ఏమయింది ఆఖరికి? చేపలు చిక్కకపోగా, వున్న ఎర కూడా ఎగిరిపోయింది." అంటూ పేలుతున్నాడు ద్రోహి. పీడి మాటలు వాళ్ళలో ఒకరికి చురుక్కు మనిపించి, "నీ బొంద, నోరుముయ్యేహె! ఎత్తుకు పైఎత్తులు వేయటం నీకేం తెలుసురా బోడోడా. వూరకే వసపిట్టలా వాగుతావు." అంటూ తిట్లకి లంకించుకున్నాడు— చెంపలేసుకొంటూ వీలైనంత మర్యాదగ సమాధానం చెప్పుకొంటున్నాడు— "క్షమించండి అయ్యలు- మీకేం ఫర్వాలేదు. వాళ్ల పంచుకొన్న మీ ఆస్తి పాస్తులన్నీ త్వరలోనే మన కైవశమవుతాయి. నే చచ్చినంత వొట్టు— నమ్మండి."

"నోరు ముయ్యవోయ్! నెల నుంచి నీవాగుడు వింటూనే వున్నాం— వోపిక చచ్చిపోతోంది— పది రోజుల్లో మావి మాకు దక్కకపోవాలి, చూస్కో— నాసామిరంగ, వాళ్లనికాదు, ముందు నిన్ను కొరతేస్తాం'' అంటూ వాయగొట్టి వొదిలిపెట్టాడు.

"అరే అబ్బాయిలూ, అయిందేదో అయింది. జరగాల్సింది చూడండి. మన కొచ్చిన ఆజ్ఞల ప్రకారం నదీతీరాన్నంత జాగ్రత్తగా కాపలా కాయడం. ఆ ఎర్రపిశాచాలు యిక్కడి నుంచే ఆవలికి పోతుంటాయట. మనం అజాగ్రత్తగ వున్నామా.... మన పని ఖాళీయే'' అంటూ ఒకడు సర్దుతున్నట్టుంది.

"అయ్యలారా, ఆ విషయం నాకొదలండి— రాత్రింబగలు కంటికి కునుకు లేకుండా కాపలాలు కాస్తాను. సరేనా! అరే.... యిక్కడంతా జారుడుగా వుందేంది'' అంటూ, జారబోయి పక్కనేవున్న పొదని రెండు చేతుల్తో పట్టుకు వూగులాడుతున్నాడు. చెన్ని వుషారు చేశాను— వాళ్ళకి ముట్టాల్సినవి ముట్టచెబుదామనే వున్నాం. నెమ్మదిగా కందకంలోంచి లేచి, తుపాకీలు బారు చేశాం. సరిగ్గా అదే సమయంలో వాడు యిటే చూశాడు— కొయ్యబారిపోయాడు. 'ధన్ ధన్' మంటూ తుపాకీ పేలటం, గుండు వాడి గుండెలోంచి దూసుకుపోయి, వాడు నిలువెల్ల వణుకు, వూపుల్తో కుప్పకూలి, నిర్జీవంగా నీళ్ళకుంటలోకి జారిపోయాడు. అదే క్షణంలో నా తుపాకీతో నేను యిద్దర్ని అంది పుచ్చుకొని అవజేశా— ద్రోహి పంపద్దానన్నవాడు ఒకడైతే, రెండోవాడు సర్దిచెప్పి జాగ్రత్తలు చెప్పినవాడు.

ఎదురుకాల్పులు చేసే దమ్ములులేక, చెల్లాచెదరయి పోయారు. కటకగువుగా గందరగోళ పడిపోతున్నారు వాళ్ళు— అప్పటిదాక ఎంతో కష్టంగా అణుచుకు కూచున్న

టైగర్, పెద్ద గెంతేసి వెంబడి బడి వాళ్ళ పనిపట్టటం మొదలెట్టింది- ఒకడి కాలు కండబట్టి పీకి కిందపడేసింది. మిగతా వాళ్ళు, వాడి ఖర్మానికి వాడినొదిలేసి పూళ్ళోకి పరుగుతీశారు.

## VII

గుండెనిండా గాలి పీల్చుకొని, వెనక్కి నదితట్టు చూశాం- తూర్పు తీరానికి చాలా చేరువలో వున్నారు వాళ్ళు. ఆ మహా ప్రవాహంలో వాళ్ళు పోను పోను చిన్ని చిన్ని చుక్కల్లా కనిపిస్తున్నారు. అమ్మయ్య అనుకొన్నాం. యింతలో దగ్గిర పల్లెనుంచి చిత్రవిచిత్రమైన శబ్దాలు మొదలయి, యింకాసేపటికల్లా నది పడమటిదిక్కంతా ఒకటే 'రింగ్.... రింగ్.... రింగ్....' మంటూ ప్రతిధ్వనించింది. ఒక తుఫాను వెలిసి, యింకో తుఫాను మొదలవబోతున్నదన్నమాట. ఈసారి అన్ని వేపుల నుంచి శత్రు మూకలు రావచ్చు- వాళ్లలో చాలా మందికి జవాబు చెప్పగలమనే ధైర్యమున్నప్పటికి, ప్రస్తుత పరిస్థితుల్లో, నది దాటి తూర్పు ప్రాంతంలో మా కప్పగించబడిన బాధ్యతను నెరవేర్చటమనేది చాల ముఖ్యమైంది- అలా కాని పక్షంలో సాహసిక అమరవీరులైన మా కామ్రేడ్స్ మా, లీ లు అనుసరించిన మార్గాన్నే అనుసరిస్తూ, చివరి తూటాకి కూడా శత్రువుని గురిచేస్తూ, ఆఖరి క్షణంలో నదిలోకి దూకటమే. క్లిష్టసమయాలెన్నో ఎదుర్కొన్నా- కాని పరిస్థితి యిలా ఎప్పుడూ లేదు.

ఏంచేయాలి? యిద్దరమే వున్నాం- వెంటనే కదిలిపోదామన్నా ఈదలేని, ఎగిరి పోలేని స్థితి. కామ్రేడ్ యాంగ్ మనసులో మెదిలాడు- ఫర్వాలేదు నేను లేకపో యినా, పార్టీ-ప్రజ అప్పగించిన విప్లవ కర్తవ్యాన్ని చివరిదాక విజయవంతంగా కొన సాగించటానికి తనున్నాడు. తూర్పు తీరం చేరుతాడు- ప్రజా దళాల్ని సమీకరించి, మొదటి సాయుధ ప్రతిఘటనా దళాన్ని పునర్నిర్మిస్తాడు. పోరాటం సాగుతుంది- కొమింగ్‌టాంగ్ మూకల రాక్షస చెర ప్రజకు తప్పుతుంది.

ముందు జాగ్రత్తగ, శత్రువు చేతికి చిక్కకూడదని కాగితాలన్ని నాశనం చేసేశాను. చెన్ నాతట్టే ఆసక్తిగా చూస్తున్నాడు- మెరపులా మెరిసిందో ఆలోచన.

చెన్‌ని వెంటనే యిక్కడ్నించి పంపించేస్తే- ఎలాను యీతవచ్చు- కాబట్టి వెళ్ళి పోగలడు గదా.... చాలా వుపయోగం కూడాను.

"యిదో చెన్! వెంటనే లేచి, నది దాటేసెయ్- వాళ్ళొచ్చే లోపలే, నువ్వు యీదుకు పోవచ్చు.... వూ.... వెంటనే కదులు...."

'వెళ్ళిపోవాలా' అన్నట్టు నాతట్టు ఆశ్చర్యంగా చూసి- "మీరేమంటున్నారో నా తలకెక్కడంలేదు" అన్నాడు.

"దయచేసి ఏం తెలియనట్టు నటించకు, నామాట విని వెళ్ళిపో- యిందులో తలకెక్కని విషయమంటూ ఏమీలేదు."

కదలకుండా అలానే కూచోడం చూస్తే, కమాండరుగా నా అధికారం వుపయోగిస్తే తప్ప లాభంలేదనిపించింది.

"ఏయ్, చెన్.... నిన్నే.... వినపట్టంలేదా ? కదులు ముందిక్కడి నుంచి."

లాభం లేకపోయింది.

"క్రమశిక్షణ గురించి నేను నీకు వేరేచెప్పక్కర్లే దనుకొంటాను. చెప్పినట్టు చేయటం, నీకు తెలుసనుకొంటున్నా" నన్నాను కోపంగా, తీక్షణంగా.

"కామ్రేడ్ కమాండర్ ! పార్టీ క్రమశిక్షణ గురించి, చెప్పినట్టుచేయటం గురించి నాకు బాగానే తెలుసు- నేనదే చేస్తున్నాను."

చాలా.... చాలా ప్రశాంతంగా వుంది జవాబు- వళ్లు మండిపోయింది నాకు,

"ఏం తెలుసు నీకు ? తెలిస్తే ఎవరి మాట వింటున్నా ననుకొంటున్నావ్ ? ఏం చేస్తున్నావ్ ?"

"క్షమించండి కమాండరు. నాకు అప్పగించబడిన బాధ్యతేమన్నా వుంటే, నేను ప్రాణాలొడ్డయినా చేయాల్సిందుంటే, క్లుప్తంగా అది.... మిమ్మల్ని నదదాటించి తూర్పు తీరానికి చేర్చటం, ఆపై మీరు చెప్పినట్టు వినటం.... అంతేకాని, నిస్సహాయ స్థితిలో మిమ్మల్ని వదలేసి, నేను నదిదాటి పారిపోవటం కాదనుకొంటాను."

నేను వూహించని సమాధానం- ఎంత స్పష్టమయిన అవగాహన. చెన్‌ని చూస్తుంటే మనసు ద్రవించిపోతోంది. ఆ దీక్ష.... పట్టుదల.... ఓహ్.... నాతట్టు అదోరకంగా చూస్తూ, సూటిగా నన్నొక ప్రశ్న అడిగాడు-

"కమాండర్ యో ! ప్రజలపట్ల మీకుండే బాధ్యతని, ధోరణిని అర్థం చేసుకోలేకపోతున్నాను."

బిత్తరపోయాను.

"యింతకంటె ఎక్కువ చెప్పదలుచుకోలేదు. కాని కామ్రేడ్ కమాండర్.... మీరు.... మీరు నన్ను తక్కువ అంచనా వేసి అవమానించారు." ఈమాట అంటూంటే చెన్ కళ్లల్లో విరిసిన కన్నీటి పూలు చాలా పాఠాలు నేర్పాయి నాకు. యింతకంటే

ఎక్కువ మాట్లాడలేకపోవచ్చు. కాని అరుణారుణంగా వెలిగిపోతున్న ఆమొహం ఎన్నో అవ్యక్త భావాలని వ్యక్తం చేస్తోంది. చిన్నవాడైనా పెద్దపాఠం నేర్పాడు. కొద్దిగా ఆలస్యంగానైనా అప్పుడు అర్థమయింది నాకు- చెన్, చెన్‌వంటి ప్రజలు ఎలా వుంటారో, ఎలా ఆలోచిస్తారో, ఎంతటి త్యాగాలు చేయగలరో....

యాంగ్ తూర్పు తీరం చేరి వరకట్ట దాటడం లీలగా కనిపిస్తోంది. ఉక్కు మనిషి ముసలాయన తిరిగి నీళ్లలోకి దూకి, మా వైపుగా ఈదుకొస్తున్నాడు.

పడమర దిక్కునుంచి పెద్ద గుంపొకటి ముందుకు తోసుకొస్తోంది. అల్లంత దూరాన్నుంచే కాల్పులు ప్రారంభమయాయి.

"కామ్రేడ్ చెన్, నన్ను క్షమించు బాబు.... నిన్ను తక్కువ అంచనా వేయలేదు- అయినా సరే నిన్ను బాధపెట్టాను- సరే, సిద్ధంకా.... పోరాటానికి తయారవుదాం" అంటూ వున్న మందుగుండు ఎంతుందా అని చూశాను- తుపాకీ కాల్పులు అధికమవు తున్నాయి- తోట దగ్గరగా ఓ గుంపు చేరుకొని, యిసుకదిబ్బ వెనుకనుంచి కాల్పులు సాగించారు- గుళ్లు మా వెనుకనున్న వరకట్టలోకి రివ్వున దూసుకుపోతున్నాయి. వాళ్లు దగ్గరయేవరకూ మేము అలానే రక్షణ తీసుకొంటూ కూచున్నాం- వాళ్లు ఎంతసేపటికి దిబ్బ వెనక నుంచి కాల్చటమే తప్ప, అడుగు ముందుకేసేలా కనపించలేదు- ఎంత సేపని కాలుస్తారు? కాసేపటికి అటునుంచి కాల్పులు ఆగిపోయి, ఎర్రగుడ్డ ఎగరే యటం కనిపించింది- యింతకుమునుపు గుంపులోని బందిపోటొకడు, అరుచుకొంటూ ముందుకొస్తున్నాడు.

"బాబ్బాబు.... నన్ను కాల్చకండి.... యిదో బాబు.... చెన్.... యిటు చూడు. నా వెనకే ఎవరున్నారో....? చూడకుండా కాల్చకండి.

ఆ గుంపు వెనక నుంచి యిద్దర్ని వాడి ముందుకి తోశారు. చెన్ హడలి పోయాడు వాళ్లని చూడటంతోటే. వాళ్లు చెన్ అమ్మ.... తమ్ముడు....

చెన్ తల్లి బట్టలు చిరిగి, వొళ్లంతా రక్తం కారుతోంది. రెడరెక్కలు విరిచి కట్టేశారా రాక్షసులు ఆవిడ్ని. ఆవిడ నిలుచోటానికి ప్రయత్నిస్తూనే, మా వైపు చూస్తోంది. పిల్లవాణ్ణిమటుకు కట్టేయలేదు. కాని వాళ్లుపెట్టిన హింసకు వొళ్లంతా పచ్చిపుండై నిలబడ లేకపోతున్నాడు. ఒక చేత్తో తల్లి భుజాన్ని ఆసరా చేసుకుంటూ వేరొచేత్తో ఓ కర్ర ఊతంగా నిలబడుతున్నాడు. శరీరం కమిలిపోయింది. వాళ్లని చూసీచూట్టంతోటే టైగర్ వాళ్లదగ్గరి కెళ్లిపోయింది. వీళ్లను చాటు చేసుకొంటూ,

ఆ వెధవల్లో యిద్దరు, ముగ్గురు నీచులు ముందుకొచ్చారు. వాళ్లలో ఒకడు "జాగ్రత్తగా వినండి. మాస్టారు 'పూ' గారు మీతో మాట్లాడాలనుకొంటున్నా" రనగానే, లావుపాటి బిడుద్దాయి ముందుకొచ్చి, తల్లి-తమ్ముణ్ణి వేలుపెట్టి చూపిస్తూ, చెన్‌తో అన్నాడు.

"యిదో చెన్, నీకళ్ల ముందున్నదెవరో చూస్తున్నావనుకొంటున్నాను. నీముందు రెండేరెండు అవకాశాలున్నాయి. వింటున్నావా? నీ తల్లి, తమ్ముడిని ముందు చంపి, తర్వాత యిక్కడే నిన్ను కాల్చేయమంటావో, లేక తుపాకీ వదిలేసి, లొంగిపోయి, నీ కుటుంబంతో యింటికి తిరిగిపోవటమో తేల్చుకో.... నువు ఆశ్రయమిచ్చి కాపాడు తున్న ఎనిమిదవ మార్గ సైన్యం వాళ్లని మేము క్షమిస్తాం కూడా. అర్థమయిందా? రెండే రెండు దార్లురా అబ్బాయి- చావో రేవో తేల్చుకో!"

కళపెళ కాగిపోతున్న బాయిలర్‌లా వున్నాడు చెన్. కోపంతో చింత నిప్పుల్లా తయారయాయి కళ్లు. ఎంత కోపంతో వుడికి పోతున్నాడో, అంత పగగా వాడితట్టు గురి చూశాడు. ట్రిగ్గర్‌మీది వేలు కదల బోతుంటే ఆపటానికి ప్రయత్నించాను.

"చూడు కామ్రేడ్, నీ ఎదురుగ వాడేకాదు, అమ్మకూడ వుంది. నువు కాలిస్తే అమ్మకు కూడా తగుల్తుందా దెబ్బ."

నామాట వినే స్థితిలో లేడు. కను కొసలనుంచి జాలువారే కన్నీళ్లని తుడుచు కుంటూ, తుపాకీని మరింత దృఢంగా బారు చేస్తున్నాడు.

"బాబు, చెన్''' అంటూ పిలిచిందావిడ. చాలా స్పష్టంగా, నిర్భయంగా, కంచులా మ్రోగిందావిడ గొంతు.

"బాబు, చెన్....ఎక్కడున్నావు నాయనా!"

"అమ్మా....యిక్కడే, నీ సమీపంలోనే వున్నాను అమ్మా"

"కనపట్టం లేదయ్యా. ఒక్కసారి లేచి నిల్చొని ఈఅమ్మకి కనపడు బాబు.... ఎందుకులే, వద్దు బాబు. వద్దు. అక్కడినుంచి నన్ను పిలువు....యిటు రావద్దు బాబు" అంటూ ఆతల్లి చెన్‌ని అనునయంగా హెచ్చరిస్తోంది.

"బాబు, నీచిన్ని తమ్ముడు....యిదో నాపక్కనే వున్నాడు. కనపడు తున్నాడా బాబు!"

"కనిపిస్తున్నాడమ్మా" అన్నాడు చెన్ జీరపోయిన గొంతుతో, ఆ పసివాడి గొంతులో ఆవేదన, పగ ముప్పేర గొంటున్నాయి.

"చాలు బాబు చాలు. యిక నిశ్చింతగ మమ్మల్ని కాల్చేయ్." అంటూ యింకా పెద్దగా అరుస్తోందామె.

"బాబు చెన్, మమ్మల్ని కాల్చేయ్– నువ్వేమాత్రం సందేహించకు. యిదిగో, వీడు, యీ వెధవ, ప్రజాద్రోహి– వీడిని హతమార్చేయ్– మొత్తంగా వీళ్ళని దుంప నాశనం చేసెయ్. కామ్రేడ్ చెన్, నా ఓట్టి తండ్రీ.... వెంటనే తుపాకీ పేల్చేయ్ బాబు."

మాటలు కావవి కర్తవ్యబోధ. విప్లవాని కంకితమయి పోయిన ఓ తల్లి విన్న వించుకొన్న ఆఖరి కోర్కె. యిసుకదిబ్బ వెనకనున్న గుంపు ఆతల్లి మాటలకు వొణికి పోయి, భయంతో కకావికలయి పోతున్నారు. ఏమాత్రం తొట్రుపాటు లేకుండా పేలిన చెన్ తుపాకీ ఆ ద్రోహిని మట్టి కరిపించింది.

ఆతల్లి ఆనందంతో కేకేసింది.

"మంచిపని చేశావు బాబు, మిగతా పనికూడా కానియ్...."

ఈసారి....యీసారి పేలిన తుపాకి ఆ పేదతల్లిని నేలతల్లి వొడిని చేర్చింది. "అమ్మా" అంటూ గుండెలు ప్రిదిలేలా బాధ పడిపోయాడు చెన్. విపరీతమైన బాధ గుండెల్ని తొలుస్తుంటే, కన్నీరు మున్నీరై చెంపలు తడిసి పోతున్నాయి. ప్రతీకారం నరనరాన్ని మండిస్తుంటే, తుపాకీ బారుచేశా. కాని వాళ్ళు అప్పటికే చెన్ తమ్ముడ్ని లాక్కెళ్ళి పోతున్నారు. చెన్ లేచి నిలుచున్నాడు. గిట్టకరచిన పెదాల సందునించి రక్తం కారుతోంది. అమ్మవైపు కడసారిగా చూశాడు. సజల నేత్రాలతో ఆతల్లికి విప్లవాంజలి ఘటించాను.

యింతలో మళ్ళీ యిసుక దిబ్బవెనుక నుంచి ఓ తలకాయ పైకి లేచింది. ఆ పరిస్థితిలో కూడా నాకంటె ముందే చెన్ వాణ్ణి కాల్చేసాడు, ఆతరువాత లేచిన తలకాయ నావంతయింది. పది నిముషాల పాటు, కసిబడ్డ వాణ్ణల్లా కాల్చేసాం.

మళ్ళీ ఓకేక వినిపించింది ఓ మూలనుంచి—

ఈసారి చిన్నవాడ్ని ముందుకు నెట్టూ, రక్షణగా వుపయోగించు కొంటూ, ముందుకు వస్తున్నారు. నాచేతిలోని తుపాకీ జారి పోయింది. చెన్ అలానే చూస్తున్నాడు. ఎవరం కాల్చలేదు, రాను రాను వాళ్ళు దగ్గరవుతున్నారు. వీళ్ళని ఆసరగా వెనుక పెద్ద గుంపు మళ్ళీ కదులుతోంది. తుపాకీ కాల్పులు లేకపోవటంతో ధైర్యంగా ముందు కొస్తున్నారు. చిత్ర హింసకు గురైన 'చియూ'ని అలానే తోసుకొస్తున్నారు ముందుకి. గాలి హోరుకుతోడు, నదీ ప్రవాహం విపరీతంగా వుంది. దగ్గరిలో కొచ్చేస్తున్నారు.

"అన్నాయ్ కాసేయ్, కాల్చేసేయ్ వెధవల్ని. వెనకా ముందాడద్దు. ఛూ పేల్చూ" అనంటుంటే, కామ్రేడ్స్ నా పరిస్థితి ఏం చెప్పమంటారు! చెన్ తుపాకీ జాయ చేస్తున్నాడు. ప్రాధేయ పడ్డాను. వద్దు, వద్దంటూ యివతలకి లాగేస్తుంటే, అవతల........ "అన్నాయ్, అమ్మకోసం ప్రతీకారం తీర్చుకోవా! నన్ను పట్టుకు తోస్తున్న యీ దెయ్యాన్ని తూట్లుపడేలా పేల్చి పారేయ్.. నీదే ఆలస్యం.. కాల్చేయ్ అన్నాయ్"

ఇంతలో వున్నట్టుండి టైగర్ దూకి 'ఛియూ'ని చేరింది. ఛియూని పట్టుకొన్న ఆ దయ్యప్పగాడి కాలిపిక్క పట్టుకు పీకేసింది! ఆ దెబ్బతో వాడు గింగిరాలు తిరిగి 'ఛియూ'ని వదలేసాడు! మెరుపులా వెనక్కి తిరిగి, తన్ను పట్టుకొన్న వాడ్ని పడదోసి, వాడినుంచి చేతిబాంబు లాగేసి, నోటితో బాంబుపిన్ను పీకేశాడు. బాంబులోంచి వస్తున్న పొగచూసి గుంపు పిచ్చెక్కి పోయింది. యివతల నాగుండె వేయిప్రక్కలై పోతోంది.

పెద్ద శబ్దంతో బాంబు పేలింది. తెల్లని దట్టమైన పొగ కమ్మేసింది. ఒక వుజ్వల వుదయం కోసం, అరుణతారొకటి రాలిపోయింది. విముక్తి పోరాట అమరుడు కామ్రేడ్ 'ఛియూ'. ఆ పొగలో చావుతప్పి పోబోతున్న వాణ్ణి, మా తుపాకులు పట్టు బెట్టాయి.

## VIII

పోరాటమే జీవితంగా గడుపుతున్న నేను ఎన్నో ఘటనలు చూశాను. కాని కామ్రేడ్స్, నేను ఎప్పుడూ యింతగా చలించలేదు. ఆ కోపంలో తుపాకీని నిప్పులు కక్కిస్తున్నా- ఒక ప్రయోజనం కోసం ఆహుతయిపోయిన ఆ వీరమాత, చిన్నబాబుల కోసం పగ తీర్చుకొంటున్నా- చెన్ కూడా అంతే. నాకంటే చాలా జాగ్రత్తగా, ఎంతో స్థిమితంగా, ప్రతి తూటాని శత్రువు గుండెలమీదే కాలుస్తున్నాడు- వున్న కొద్ది పాటి తూటాలతోనే ముసలాయన తిరిగొచ్చేదాక ప్రతిఘటించాలి- అప్పుడప్పుడు చెన్ వెనక్కి తిరిగి నదివేపు చూస్తున్నాడు.

"కమాండర్! అదుగో, నాన్న వచ్చేస్తున్నాడు."

చాలా జాగ్రత్తగా మా దగ్గరికి చేరుకుంటున్నా డాయన.

"నాన్న, త్వరగా వచ్చేసేయ్" అంటూ కేకేశాడు. అతని వేళ్ల రక్తం చిమ్ముతున్నాయ్. బాధగ చూస్తూ, చెన్ పక్కనే కూలబడ్డాను. 'ఓ చెన్....' అని నాలో నేనే ఎన్నోసార్లనుకొన్నా. దగ్గరవుతోన్న గుంపుని చూసేసరికి రక్తం పరవళ్లు తొక్కింది. ధన్... ధన్....ధన్.... టట్....టట్....టట్.... తుపాకీ చింతనిప్పులు కురిపిస్తోంది- ట్రిగ్గర్ మీది వేలు శరవేగంతో కదిలిపోతోంది.

బలమైన హస్తం భుజాన్ని తాకింది.

"కమాండర్ యో, వచ్చేయండి- నదిలో దూకి, వెళ్ళిపోదాం" అంటూంటే నాకు మండిపోయింది- ఏమిటి వీళ్ళ? ఈ మనుషులు....

"కాసేపు మాట్లాడించ'వద్దంటూ కదిలిన వాణ్ణిలా కాల్చేస్తున్నా- కొడుకు పక్కనే కందకంలో చేరి ప్రేమగా చెన్ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొన్నాడు- చెన్ కళ్ళతెరచి, నవ్వుతూ తండ్రి కళ్ళలోకి చూశాడు.

"నాన్నా" అంటూ నెమ్మదిగా, బాధగా పిలిచాడు.

"నాన్నా.... నువు.... నువు, ఆయన్ని నది దాటించగలవు నాన్నా" అన్నాడు.

కనుచూపుమేరలో పడివున్న భార్యా, పిల్లడి శరీరాలు చూశాడు- అప్రియత్నంగా వస్తున్న కన్నీళ్ల నాపుకొంటూ, నా చేయి పట్టుకు లాగాడు.

"వచ్చేయ్ కామ్రేడ్- ఆలస్యం చేయొద్దు"

"నావల్లకాదు- మీరు తిరిగి వెళ్ళిపొండి- నేను, చెన్‌తో పాటే యిక్కడే వుంటాను."

"వీల్లేదు కామ్రేడ్ కమాండర్- నాన్నతో మీరు వెళ్ళితీరాలి" అంటూ అతికష్టం మీద తుపాకీని బారుచేస్తూ, "మీకు రక్షణగా నేనిక్కడేవుండి వాళ్ళ పనిపడతా" నన్నాడు చెన్. నావల్ల కాదంటూంటే వినిపించుకోకుండా, ముసలాయన నన్ను వరకట్ట దూకించి, నదిలోకి గెంతించాడు.

"బాబు చెన్.... నా కామ్రేడ్ చెన్" అని అరుస్తూంటే, నోటినిండా నీళ్ళపోయి, గుండె పట్టుకుపోయింది. పంవళ్ళ తొక్కే వరదనీటిని దూసుకొంటూ తోసుకుపోతు న్నాడాయన. గాలిహోరుకి చెవులు దిమ్మెక్కిపోతున్నాయి. వెనక్కి తల తిప్పిచూశాను- చింతనిప్పులు కక్కుతోంది చెన్ తుపాకీ. శత్రుమూకల తూటాలుతగిలి లేస్తున్నదుమ్మని కాళ్ళతో తంతూ, అరుస్తోంది టైగర్. చాలా దృఢంగా, మాకు రక్షణనిస్తూ, చెన్ హోరాహోరి పోరాడుతుంటే, నావళ్ళ గగుర్పొడిచింది- ఆ దృశ్యం చూసి నిలువెల్ల వాణికిపోయాను.

'కదలకుండా వుండలే'వంటూ అరుస్తూ, నన్నాయన గట్టిగా పట్టుకొని ముందుకు తోసుకెల్తున్నాడు. ఆయనలో చెలరేగుతున్న తుఫానుని అణచేసుకోవటం గమనించాను- రక్తం ధారపోసైనా సరే, నన్ను ఆవలిగట్టుకు చేర్చాలనే దృఢదీక్ష ఆయన పట్టులో కనిపించింది. ఆయన కదలిక కదలికలో పొర్లుతున్న అలల కదలి, కదుల

తున్న శ్వాస, విప్లవ దీక్షను వెల్లడిస్తున్నాయి. ప్రమాదానికి దూరంగా లేకపోయినా, వాళ్లకి అంత చేయవలోమటుకి లేము. యింతలో మా కందకం దగ్గరికే వాళ్లు రావటం కనిపించింది. నదిలో ముందుకెపోతున్నా, నా మనసు, ఆలోచన చెన్‌తో అక్కడేవుంది. యింతలో తుపాకీ కాల్పులు ఆగిపోయాయి. వెనుతిరిగి చూసిన నా కళ్లకు—

నెమ్మదిగా వరకట్ట చేరుకున్నాడు చెన్. తన చేతిలోని తుపాకీని నీళ్లలోకి విసరేస్తుంటే, తన వెనకే ఓ బందిపోటు వెధవ కనిపించినట్టుంది. తుపాకీని నీళ్లలోకి విసిరేస్తూనే, వాడి పీక పట్టుకొని, నీళ్లలోకి దూకేశాడు చెన్. ప్రవాహంలో కలిసి పోయారు వాళ్ళు. చూడలేక పోయాను ఆ దృశ్యాన్ని. ముసలాయన ఎగశ్వాస ఎక్కువయింది. మా తట్టే గురిచేసి కాలుస్తూ ఆ వొడ్డున అనేక మంది కనిపిస్తున్నారు. వగరుస్తూ, వణుకుతూ నన్నాయన యీదుకెళ్తూనే వున్నాడు. గురిచేతకాక, పిచ్చెక్కి నట్లు ఎటుపడితే అటే కాలుస్తున్నారు. కొద్ది క్షణాల్లో తూర్పు ఒడ్డు నుంచి కాల్పులు ఆరంభమయ్యాయి. అంటే మాకు రక్షణగ అవలి గట్టు నుంచి యూంగ్ బృందం కాల్పులు మొదలయ్యాయి. మేము సురక్షితంగా తూర్పుతీరం చేరబోతున్నామన్నమాట.

— మరి చెన్ సంగతేమిటి?

వలయాలు వలయాలుగా తిరిగి పోతున్న అలలు మినహా ఏమీ కన్పించలేదు. అప్పటిదాక దాగివున్న వుద్రేకాలను అణచుకోలేకపోయాను. నా పదేళ్ల పోరాటచరిత్రలో ఏనాడు నా భావాల్ని బయటకు వ్యక్తం కానీయలేదు. ఈరోజు నన్ను నేను సంబాళించుకోలేకపోతున్నాను. పొంగిపొరలే దుఃఖాన్ని ఆపుకోలేక పోతున్నాను.

— నాకే కనుక యీత వచ్చివుంటేనా—

ప్రతి అల అలని గాలించి, లోతుకంటా వెళ్లి, చిన్నారి నా కామ్రేడ్ చెన్‌ని వెదికుండే వాడిని. ఎంత గొప్ప మనిషి. నా వూరు తెలియదు. వివరాలు తెలియవు నేనెందుకొచ్చానో మాత్రమే అతనికి తెలుసు. నా అసలు పేరు తెలియదు. అయినా వేరే ఆలోచనే లేకుండా నాకోసం తన ప్రాణాల్నే అర్పించాడు। పోరాటం వూపిరిగా బతికిన అమరుడు మా కామ్రేడ్ చెన్.

యవ్వనంలో అడుగు పెడుతున్న చిరుప్రాయం. ఆ వయసుని మించిందే ముంటుంది?

అయినా ఒక వున్నత ఆదర్శంకోసం, కామ్రేడ్ అనే మహత్తరమయిన పిలుపు కోసం, పార్టీపట్ల, పనిపట్ల వున్న విప్లవ విశ్వాసంతో....కామ్రేడ్ చెన్ జీవితం విప్లవం

చింది. ఎవరయినా యింతకన్నా చేయగలిగిందేముంటుంది? ఓహ్.... ఎలాంటివాళ్ళు యీ దేశప్రజలు....

బాబు.... కామ్రేడ్ చెన్- నువ్వు, మీ అమ్మ, తమ్ముడు మేము ఎలా బతకాలో మార్గం చూపించారయ్యా.

నన్ను చుట్టేసిన, మీనాన్న చేయి చాలాదృఢంగా,.... యింతకు యింకెంత కష్ట మొచ్చినా తట్టుకొంటూ, నన్ను ముందుకు తీసుకెళతోంది.

ఈది....యీది వొడ్డు చేరబోతున్నాం. కొద్దిగ పట్టుసడలి, వేసిన మునకతో నోటినిండ, ముక్కునిండ నీళ్ళు వెళ్ళాయి. గట్టిగా శ్వాసపీల్చి, తిరిగినన్ను వొడిసి పుచ్చుకు పైకి లాగాడు. అప్పుడు చూశాను- ఆయన భుజం దెబ్బతగిలి రక్తం కారటం.

అవును, ఆయన దెబ్బతిన్నాడు. అయినా సరే తనశక్తంతా అయిపోయినా, ఆఖరి శ్వాస వరకు నాకోసం పెనుగు లాడుతున్నా డాయన. నాపరిస్థితిని మీ రూహించు కోండి. కామ్రేడ్స్ నాలో నాకే అనిపించింది. ఆ క్షణాన "ఓ యూవో-కాంగ్- చుంగ్, ఏం చేశావసయ్యా నీకోసం వీళ్ళు ప్రాణాలర్పించటం? నీకోసం ఎందుకిలా కామ్రేడ్ చెన్ కుటుంబం ఆహుతయిపోవాలి? ఎవరిచ్చారు నీకీహక్కు? ఎలా కల్గిందీ అర్హత? చెప్పు....?" అంటూ నన్నునేనే నిగ్గతీసుకొన్నాను.

"ఓ చెన్.... నేను వెళ్ళి పోతున్నాను, వెళ్తాను" అంటూ అరిచాను.

"అరవకుండా అలా పడి వుండలేవు కాసేపు" అంటూ నావైపు కోపంగా చూస్తూ అన్నా డాయన-

"నీలోనువ్వే యిదైపోతూ, అలా మాట్లాడ టానికి సిగ్గు పడాలి, తెలుసా?"

విపరీతమైన శక్తి, ఎక్కడి నుంచి వచ్చిందో, ఆమాటని ఆయన నన్ను తూర్పు తీరం వైపుగా యీదుకెళ్ళి పోతున్నాడు.

మా వెనక పడి పోతున్న అనంత మైన జలరాశిలో పెద్ద ఎర్రని కెందామర విచ్చుకొంది.

కామ్రేడ్స్....

"అడుగడుగునా పోరాటం నేర్చుకో
బతుకు కోసం చావటం నేర్చుకో'

అంటే ఏమిటో, ఎందుకో యీ క్షణాన స్పష్టంగా అర్థమయింది నాకు.

* * * *

[- ఇప్పుడు చెప్పండి కామ్రేడ్స్ -

కామ్రేడ్స్,

అదీ నాకు తెలిసిన కామ్రేడ్ చెన్ కుటుంబ జీవితం గురించిన గాథ.

ఈ పాటికే మీలో ఎన్నో ప్రశ్నలు రేకెత్తుండవచ్చు. మేమువొడ్డుకి సురక్షితంగా ఎలా చేరుకోగలిగాము?

ఆ ముసలి కామ్రేడ్ ఏమయ్యారు?

చెన్ మునిగిపోయాడా?

మిగతా వాళ్లని యీవలికి చేర్చడం, మాకార్యక్రమం విజయవంతంగా ముందుకి కొనసాగడం ఎలా జరిగింది?

ఇవన్నీ మీకు తెలియచెప్పాల్సిన బాధ్యత నామీదుంది. మేము తూర్పుతీరం చేరి మనవాళ్ళను కలిశాము. ముసలాయన్ని ప్రజావైద్యశాలలో చేర్పించాం. నెల తిరక్కముందే, ఆయన కోలుకొని నాదగ్గరకొచ్చారు.

"నాకో తుపాకీ కావాలి. యిస్తారా?" అనడిగారాయన. ఆయన ఎందుకడిగారనే ప్రశ్న మీరు వెయ్యరను కొంటాను. అక్షణాన్నే నా తుపాకీని ఆ వీరునికిచ్చాను. ఆ నిమిషాన మొదటి సాయుధ ప్రతిఘటనా దళానికి ఓ అజేయమైన వీరుడు లభించాడు. ఆయన తనకోసం ఏమి అడగలేదు, చిరుగులు పడ్డ ఆ వున్ని కోటు తోటే, ఆయన ఎప్పుడూ యుద్ధరంగాన ముందు నిలచేవాడు. తెల్లని గడ్డం మెరమెరలాడుతుంటే, కళ్ళుకాంతిగా మెరిసిపోతుండేవి.

కామ్రేడ్ చెన్ శరీరం ఆరోజే వరదకువొడ్డుకికొట్టుకొచ్చింది. చావులో కూడా ఆ వీరుని పిడికిళ్ళు బందిపోటుగాడి గొంతుని ఆలానే వొడిసిపుచ్చుకొని బిగిసుకుపోయున్నాయి. ఆ పక్కనే టైగర్ కూడా పడిపోయుంది.

తూర్పు తీరప్రాంతంలో పోరాటాన్ని విజయవంతంగా కొనసాగించాం. చెల్లాచెదురయిన వాళ్ళందరని కూడదీశాం. ఎంతో మంది సంఘ విద్రోహుల, గూఢచారుల మధ్యనే, దళాన్ని సంఘటిత పరుస్తూ, పునర్నిర్మించుకోవాల్సి వచ్చేసరికి, మా వాళ్ళకి ఎవరిని నమ్మాలన్నా అనుమానంవేసేది. జనం నిస్పృహకు గురయ్యారు. కొమింగ్టాంగ్మూక 'ఏరివేత' కార్యక్రమాన్ని అమానుషంగా కొనసాగిస్తోంది. జనాన్ని చంపటం.... ఆస్తుల్ని తగలబెట్టటం సర్వ సాధారణమయిపోయింది వాళ్ళకి. అయినా అన్ని ఆటంకాలను అధిగమించాం. కామ్రేడ్ చెన్ కుటుంబం మా స్మృతి పథంలో శాశ్వతంగా నిలిచిపోయింది. ఆ జ్ఞాపకాల వెలుగులో చూసుకొన్నప్పుడు, మేము పడ్డ

కష్టాలు ఏమంత పెద్ద బాధనిపించలేదు. తిరిగి ఒక చోట కూడుతూ, పటాలాలుగా మారుతూ, 'తిరోగామి మూకల'ని పూచకోత కోస్తూ, వాళ్ళ ప్రధాన కార్యాలయాల్ని ధ్వంసంచేస్తూ, విజయాలతో ముందుకు సాగిపోయాం. ఆ పోరాట క్రమంలో కొంత మంది పచ్చి దుర్మార్గులైన శత్రువర్గనాయకుల్ని నిర్మూలించాం.

మా విజయాలూ, పురోగమనం జనంలో కొత్త ఊపిరిని, జీవాన్ని పోసింది. గెరిల్లాదాడులు మరింతగా కొన సాగిస్తూ చాంగ్‌పీ—ఓమావో ప్రాంతాల శత్రుమూకల్ని తిరిగి తల ఎత్తే అవకాశంలేకుండా చేశాం. మా దృష్టిలో యిది నిజమైన ప్రజాసేవ—. ఒక ఘన విజయం. నవంబరు నెలలో మా కృషిని మెచ్చుకొంటూ పై నుంచి వర్తమా నాలందాయి. వీరపతాకాలని కూడా బహూకరించారు. ఆ సందర్భంగా జరిగిన వేడుకలో నన్ను వేదిక నుంచి రెండుముక్కలు చెప్పమన్నారు, నేనేం చెప్పాలను కొన్నానో అదే చేప్పాను.

> "కామ్రేడ్స్! మీ ముందు నిలబడ్డ యీ వ్యక్తి యింత గౌరవానికి, ప్రశంసకి అర్హుడు కాడు. ఈ విప్లవాభినందనలకు నిజమైన అర్హులు కామ్రేడ్స్ చెన్, అతని కుటుంబం మాత్రమే."

(చైనా కథ Dawn on the River కు స్వేచ్ఛానువాదం:
శ్రీ కాకుళరావు)

---

ఈ కథ శీర్షికను 'అగ్ని సరస్సున వికసించిన వజ్రం' గా చదువుకోవాలి.

---

# రైతు కూలి కోలాటం

వంగపండు ప్రసాదరావు

మబ్బు తెరసి సూడరాదా
ఓ సెందురుడా
మా బతుకులు పాడరాదా! ॥మబ్బు॥

రైతు కూలి రాజ్యమనీ
రాతల్లో – రాసేరూ
సెట్టుపేరు సెప్పుకోని
కాయలమ్ము తున్నారు
మాటలేమొ సెప్పుతారు ఓ సెందురుడా
ఓటులేమొ అడుగుతారు నా సెందురుడా
॥మబ్బు॥

అ, హా శః భూములన్ని
రైతన్నల వంటారు
బుగతల పేరునా
రాసీసు కుంటారు
రాజకీయ నాయకు లేమో ఓ సెందురుడా
రాజీలు పెడతుంటారూ. నా సెందురుడా
॥మబ్బు॥

బురదల్లా కూడ దీసి
వరినారు వుడుపుజేసి
భూ లోకం పెజల కల్ల
బువ్వని తిని పిత్తారు
బతకలేక సవ్వుతారు ఓ సెందురుడా
సవ్వలేక బతుకుతారు నా సెందురుడా
॥మబ్బు॥

మిరపకాయ వుల్లిపాయ
మెరక దున్ని వుడుస్తారు
వూరు సావుకారులుకీ
వడ్డీలు కొలుస్తారు
తాలింపు లేని పులుసూ ఓ సెందురుడా
తాగలేక కక్కుతారు నా సెందురుడా
॥మబ్బు॥

నూరు గండాలు దాటి
నూలును పండి త్తారు
పండిన ఆ నూలల్లా
పాయిదాలు కడతారు
సిక్కు పడిన కొప్పు కేమో ఓ సెందురుడా
సుక్క నూని రాయిలేదు నా సెందురుడా
॥మబ్బు॥

సావఁలు గండెలూ
సాలుబోసి జల్లుతారు
గొప్పు తవ్వి – గాబుదీసి
దుల్ల గొట్టి దెత్తారు
సర్కారు శిస్తులు గట్టీ ఓ సెందురుడా
పస్తులతో సత్తుంటారు. నా సెందురుడా
॥మబ్బు॥

అప్పులు ఇస్తామనీ
హామీ తెమ్మంటారు
హామీ లేక పోతె
జామీ ఇమ్మంటారు
ఏమీ లేదన్నా మంటే ఓ సెందురుడా
ఎల్ల గొట్టి పొమ్మంటారు నా సెందురుడా
॥మబ్బు॥

భూసోములు సావుఁకార్లు
ప్రో నోటులు రాసినారు
అబద్ధాలు సెప్పినారు
ఆస్తులన్ని దోసినారు

ఆకలితో సంపినారూ ఓ సెందురుడా
అప్పులోల్ని జేసినారూ నా సెందురుడా
॥మబ్బు॥

అడుగడుగో అందుకే
ఆకలితో వున్నోలు
ఆలోసన జేసేరూ
అగ్గిలాగ మండేరూ
జరుగు బాటు కావాలంటూ ఓ సెందురుడా
తిరుగుబాటు సెయ్యాలంటూ నా సెందురుడా
॥మబ్బు॥

## కూలోల్ల పిల్లా

వి. వి. గద్దర్

ఊరు సంగతి జెప్ప
పోరు పొలిమర  ప్ప
పాసిపోతివె పిల్లో....
నా కూలోల్ల పిల్లా ॥ఊరు॥

సామా నల్పుదాన
సక్కని గునెముదాన
రామా సక్కనిరూపు
సెందురూని సూపు
ఎందుబోతివె పిల్లో....
నా కూలోల్ల పిల్లా ॥ఊరు॥

కోపు తట్టలు మోసి
కంప మోపులు మోసి
కాయ కష్టం చేసి
కలో గంజో దాగి
ఎక్కడ పోతివె పిల్లో....
నా కూలోల్ల పిల్లా ॥ఊరు॥

సత్తెమన్నకు నీవు
సల్లబోసిన వంట
గణపతన్నకు నీవు
గంజి బోసిన వంట
భాస్కరన్నకు నీవు
బువ్వ బెట్టిన వంట
ధారి బుద్దేపిల్లో....
నా కూలోల్ల పిల్లా ॥ఊరు॥

పోలీసోళ్ళు వొచ్చి
పట్టి గుంజుక పోయి
చీకటోళ్ళ అడుగు
జాడజెప్పు మాని
నిన్నుగొట్టిన గాని
నిన్ను శీరిన గాని
అంత దెల్సిన కూడా
ఇంత జెప్పాలేదు
ఎంత దైర్నమె పిల్లో
నా కూలోల్ల పిల్లా ॥ఊరు॥

కూలీ రాజ్యం కొరకు
కోటి బాధలు పొంది
సుత్తె కొడవలి జెండ
ఎత్తి పట్టూకోని
నువ్వు కలలుగన్న
కూలీ రాజ్యంలోనా
కలుసు కుందమె పిల్లో....
నా కూలోల్ల పిల్లా ॥ఊరు॥

## ఏమిటుద్ధరిస్తారండీ....

చెరబండరాజు

ఏమిటుద్ధరిస్తారండీ.... ఈః.... ఈః.... యాహాః యాహాః యాః
దారిద్ర్యం పోయేటి దారేదన్నుందంటారా- లేదంటారా
ఉందంటారా- లేదంటారా.... ॥ఏమి॥

ఆత్మకర్ర లెగరేస్తూ
అధ్యాత్మిక పోలీసులు
కాకిజాతి దుస్తులేసి
కసరత్తులు చేసెటోళ్లు ॥ఏమి॥

మానవ పరిణామ గతిని
ససేమిరా ఒప్పనోళ్లు
శ్రమ కతీతమైన శక్తి
దైవశక్తి అంటోళ్లు ॥ఏమి॥

గతమంతా మంచిదనీ
గావుకేక లేసెటోళ్లు
మతరాజ్యం నిర్మిస్తే
వెతలు తీపనంటోళ్లు ॥ఏమి॥

నాస్తికత్వమే శాంతికి
మొదటి శత్రు వంటోళ్లు
పరమతాల సరిహద్దుల
తరిమేయా లంటోళ్లు ॥ఏమి॥

ఎల్లలపై ఉన్న ప్రేమ
శ్రమజీవుల పట్లుండక
దేశమంటె మనుషులనే
సంగతి వొదిలేసినోళ్లు ॥ఏమి॥

బావినీరె సాగరమను
మండూకం మనసుగాళ్ళు
మతం చుట్టు తిరిగి తిరిగి
మనిషిని పాతేసినోళ్ళు ॥ఏమి॥

(రచనా కాలం : 3 అగస్టు 1975 సెంట్రిలు జెయిలు, హైదరాబాదు)

---

"లెనిన్ నేడు లేడూ ?
చూడు జనంలో వున్నాడు !"

---

# పంజాబీ కవిత్వంలో ఒక దశాబ్దం

చమన్‌లాల్ ప్రభాకర్

1967 లో చెలరేగిన రైతాంగ తిరుగుబాటు దేశమంతా వ్యాపించి సమాజం అన్ని రంగాలలోనూ తన ప్రభావాన్ని చూపింది. ఈ పోరాట దశాబ్దిలో పంజాబీ కవులను పేర్కొనాలంటే చాలా మంది పేర్లు చెప్పాల్సి వస్తుంది. పాష్, సూర్జిత్ పాతర్, అమర్‌జిత్‌చందన్, లాల్ సింగ్‌దిల్, దర్శన్ ఖల్‌కల్, గురుదీప్ గ్రేవల్, హర్‌బజన్ హల్వానీ, సంతరామ్ ఉదాసీ- వాళ్ళల్లో ప్రముఖులు. వీళ్ళల్లో కొంతమంది 67 కన్న ముందే కవులుగా ప్రసిద్ధికెక్కారు. కానీ తర్వాతవాళ్ళ కవిత్వం మీద ఉద్యమం ప్రభావం ఉంది. భావవాద కవిత్వం (Abstract Poetry) బలమైన ధోరణిగాఉంటూ వచ్చిన ఆ రోజుల్లోనె వీళ్ళది ప్రజానుకూల కవిత్వంగా పేర్కొనవచ్చు.

ఇంతమంది కవుల పట్టీలో జీవితం నుండీ అనుభవం నుండీ పుట్టి తనదంటూ ఒక గొంతును ప్రకటించిన పోరాట కవిగా మొట్టమొదట 'పాష్'ను పేర్కొనాలి. నిజానికి ఈ దశాబ్దంలో పంజాబీ విప్లవ కవిత్వానికి ప్రతినిధులుగా పాష్, సూర్జిత్ పాతర్, చందన్ లను చెప్పుకోవచ్చు.

పాష్‌వి ఇంతవరకు రెండు కవితా సంకలనాలు వచ్చాయి. అంతేకాక 'మిట్టి దా రంగ్' లాంటి కవితా సంకలనాల్లో కూడా అతని కవిత్వం వచ్చింది. "లోహకథా" (ఇనుము కథ) కవితా సంకలనంలో పాతుకు పోయిన విలువలని ప్రశ్నిస్తూ గొంతు విప్పిన ఈ కవి అప్పటి వయస్సు (1969) పందొమ్మిదేళ్ళు మాత్రమే. అప్పట్లోనే రాసిన "బెదవా" గీతంలో....

> వాళ్ళు ఈ దేశంలో పశులన్నిటిని
> 		విద్రోహులుగా ప్రకటించారు.
> కాని ఓ గురూ!
> 'బెదవా' పై సంతకం చెయ్యని
> శిక్ ఎవడు?
> ప్రతి జైలుని, ప్రతి లాకప్‌ని
> సిరిహింద్ గోడల్లా, ఆనంద్‌పూర్ సాహిబ్ కోటల్లా
> పరిగణించని వాడెవడు?

అన్న ఈ కవి విప్లవ చైతన్యాన్ని జాతీయ రూపంలోకి (Nationalist in form) అద్భుతంగా మేళవించాడు. జులుంకి, అన్యాయానికి వ్యతిరేకంగా శిక్‌లు పోరాడుతున్న

కాలంలో గురు గోవిందసింగ్ ని అందరు వదిలి వెళ్ళిపోతారు. "బెదవా" (అవిశ్వాసం) పై సంతకం చేసి వెళ్ళిపోయిన సిక్ లలో 40 మంది తిరిగివచ్చి పోరాటంలో ప్రాణాలు అర్పిస్తారు. ముక్తిగా శిక్ మత సాంప్రదాయంలో ఇప్పటికీ గౌరవింపబడే ఆ నలభై మందితో పోరుబాటొదలని విప్లవ కారులను పోలుస్తూ సాంప్రదాయ సంస్కృతీ పరి భాషలో పోరాట పటిమని చిత్రీకరించడమే కవిగా పాష్ గొప్పతనం.

"తుఫాన్ నె ఖేదీ లి మత్ నహీ ఖాద్ది", "ఉద్దాద్ బజన్ మగర్" లాంటి కవిత్వంలో అతను వాడిన రూపం సూటిగా గుండెలతో సంభాషిస్తుంది. "యుద్ధ్ దే శాంతి" (యుద్ధము, శాంతి)లో

యుద్ధ నివారణ కోసం
మ ల్ని మనం కించపర్చుకున్నాం
మనం ఏ శాంతికోసం
దేవులాడామో ఆ శాంతి
పులినోట రుచిగా మారిం ‌
అన్యాయం, అవమానం ఉన్నచోట
శాంతిలేదు, ఉండదు.
అందుకే ఇవ్వాళ
శాంతి కావాలంటె
యుద్ధంలో పోరాడాలి

అని పిలుపు నిచ్చాడు.

సూర్జిత్ పాథర్ వాస్తవికతను అనుభూతులుగా చిత్రీకరించగలడు. సున్నితమైన వ్యంగ్యం తోను కవిత్వం చెప్పగలడు.

తుపాకీ మంటలు
విద్యార్థుల గుండెలు చీల్చినప్పుడే
వాళ్ళ భవిష్యత్ రాయబడింది.
వాళ్ళు
ఎవరు చెప్పని పాఠాలను నేర్చుకున్నారు.
అప్పుడప్పుడు
అజ్ఞాత గెరిల్లాలను అడుగుదామా
అనుకుంటాను
నా గీతాలు కాల్చి చలి కాచుకోమనీ

గీతంలో వ్యక్తీకరణ, వ్యంగ్యం కూడా సున్నితంగాను, సూటిగానూ తగుల్తాయి

లాల్‌సింగ్ దిల్ కవితా చిత్రికలో సామాన్య ప్రజలు ఛాయలుగా కదుల్తుంటారు. జానపద సంగీత బాణిలో కట్టిన ఆతని కవిత్వం సాంఘిక వాస్తవికతకు కవితా ప్రతిబింబం. సైనికుడి భార్య ఉత్తరం, రైతుకూలీ జీవితం, గీతాన్ని సంగీతంలా చెప్పడమే అతని ప్రతిభ.

అమర్‌జీత్ (చూ॥ సృజన 77 నవంబరు, 78 మార్చి సంచికలు) కవితలో సామాజిక, రాజకీయ వాస్తవికత అద్భుతమైన ఇమేజెస్ తోనూ ఇమేజరీస్ తోనూ అల్లుకుని కనిపిస్తుంది.

"కౌన్ నహీ చాహేగా" (ఎవరు వాంఛించరు?) 'యాద్' (జ్ఞాపకం) కిసీ భి సాజ్ దా నామ్ దో (ఏ వాయిద్యం పేరైనా తీసుకో) మొదలయినవి అతని కవిత్వంలో చెప్పుకోతగ్గవి. రెండు మూడు పాదాల్లో వింతగా అనుభూతిని కలగచేయడం అతని ప్రత్యేకత.

తన ఖైదీ గీతంలో

> కొన్ని ఇనుప చువ్వలు
> కొంత గోడ
> ఒకే ఒక్క ఆకాశం ముక్క

అంటూ కారాగార శూన్యాన్ని మనకు కళ్ళకు కట్టగలిగాడు.

పంజాబీలో కూడా కవులు ప్రభుత్వ నిర్బంధానికి గురిఅయ్యారు. అమర్‌జిత్ చందన్, పాష్, దర్శన్ ఖట్కర్, ప్రేమ్ ప్రకాష్, గుర్షన్ సింగ్, డాక్టర్ దీసంజీ మొదలయిన కవులు అనేక సార్లు జైలుకి వెళ్లారు. చందన్, పాష్, సంత్‌లామ్ ఉదాసీ పోలీసు చిత్రహింసలకు గురిఅయ్యారు- హత్యానేరాల్లోనూ, మీసాలోనూ ఇరికించబడ్డారు.

ఇప్పుడు రాస్తున్న యువకవుల్లో ప్రత్యేకించి గురుదీప్ గ్రెవాల్, ఫతెజిత్, లోకనాథ్‌లను చెప్పుకోవాలి.

నిజానికి పంజాబీ కవిత్వం గత దశాబ్దిలో పంజాబీ సాహిత్యంలో వచ్చిన మార్పులకి ప్రతీక. బహుశ ఒక్క బెంగాలీ తెలుగుల్లోనే కవిత్వం ఇంత పరిణతి చెందింది. కవిత్వ ప్రవాహాన్ని నడిపించేది జీవితమే. ఈ మూడు ప్రాంతాలలోనూ జీవితంలో సమాజంలో వచ్చిన పరిణామాలె ఈ సారూప్యానికి కారణం.

ఉద్యమంలో చీలికలతో అనేక మంది పంజాబీ కవులు నిరాశకు గురిఅయినా జీవితంతో ప్రతిస్పందిస్తూనే ఉన్నారు. పంజాబీ పోరాట సాంప్రదాయం నిరాశకు అతీతమైనది. వర్తమానంలోనూ రానున్న కాలంలోనూ పంజాబీ కవిత్వం మరింత అభివృద్ధి కరమయిన మార్పులకి గురి అవుతున్నదనేది కేవలం ఆశకాదు- వాస్తవం కూడా. అందుకు ఇవాల్టి పంజాబీ కవిత్వమే సాక్ష్యం.

(అనువాదం: సురా)

## తుఫానులకు ఓటమి లేదు

పాష్

గాలి
దిక్కు మార్చడంతో
భయాందోళన....

తమ
షామియానాలు కూలిపోయిన వాళ్లు
ప్రకటిస్తున్నారు,
చెట్లు శాంతించాయని
తుఫాను అణిగి పోయిందని-

ఈ
ప్రకటనలకు
తుఫాను అతీతమని వాళ్ళకు తెలియనట్టు
మిగిలి
పోయిన మోళ్లతో భూమి
ఆకారం మారుతుందని
వాళ్లకి తెలియనట్టు

వాళ్ళు
ప్రకటిస్తున్నారు
చెట్లు శాంతించాయని
తుఫాను అణిగిపోయిందని-

ఓ భ్రమపుత్రులారా!
వినండి
గాలి దిక్కు మార్చింది
దాన్నిప్పుడు మీరు బంధింపలేరు.
ఈ భూమి
మెరుస్తూ పుష్పించనంత కాలం
మీ షామియానాలు
ఇవాళ పడిపోతాయి
రేపు కూలిపోతాయి-
కాని
తుఫానులకు
ఓటమి లేదు.

## ఉత్తరం

లాల్ సి. హ్దిల్

పక్కకి పడిపోయిన గోడ
ఇటుకముక్కలతో
ఓ సైనికుడా
ప్రేమ చిత్రం అల్లుకుంటోంది.

మరణించిన నీ తండ్రి తీర్చని
అప్పుకోసం మహాజన్*
సైనికుడా
రోజూ ద్వారం తట్టుతుంటాడు.

రాత్రింతా దీపం
కాలుతోంది
సైనికుడా
స్మశానం మండుతోంది

నిశ్శబ్దం చీకటిలో
రాబందులు
సైనికుడా
మర్చి పోయి
నిద్రించగలవా
సైనికుడా

రాత్రింతా
నే నిద్రించగలనా
ఓ సైనికుడా

పడిపోయిన గోడ
ఇటుకలతో
ప్రేమ చిత్రం అల్లుకుంటోంది
సైనికుడా! ఓ సైనికుడా!!

---

*మహాజన్: వడ్డీ వ్యాపారస్తుడు.

## నృత్యం

లాల్ సింహ్ దిల్

పేదరాలు
పెనం మీద గుండెల్ని వండుతోంది

చంద్రుడు
చెట్లమాటున దాగి నవ్వుతున్నాడు

తండ్రి
పిల్లవాడికి కథలు వినిపిస్తున్నాడు,
గిన్నెలతో గీతం వాయిస్తున్నాడు.

పిల్లవాడు
మొలతాడు వెండితీగ మురళి
మోయిస్తున్నాడు

నృత్యం చేస్తున్నాడు,
చేస్తూనే ఉన్నాడు....
ఈ సంగీతం ఆగదు....
గుండెల్లో ఈ నృత్యం
ఎప్పటికీ మరణించదు.

అనువాదం: చమన్, సురా

# జైలు ఆవరణలో మర్రిచెట్టు

అమర్ జీత్ చందన్

ఇది ఎటువంటి కాలమంటే
చెట్ల గురించి మాట్లాడడం కూడ దాదాపు నేరమే
– బెర్టోల్ట్ బ్రెక్ట్

ఆవరణలో మొలచిన
చిన్న మర్రి మొక్కతో
రాత్రింబవళ్ళు మాట్లాడుతూ వుంటాను–

నువ్వు మా స్వప్నం లాగున్నావు
దాని లక్ష్యం సుదూరమైంది–
నీ చల్లని నీడలో
ఏ బాటసారి విశ్రాంతి పొందుతాడో
నీకూ తెలియదు నాకూ తెలియదు

ఏ పక్షి నీతో పాటు
శిశిర, వసంత గీతాలు పాడుతుందో
నీకూ తెలియదు నాకూ తెలియదు

నీ చిన్న చిన్న ఆకుల్లో
ఒంటరిగా ఎండలో కదిలిపోతూ
రానున్న కాలం ఛాయల స్పందనలు
వింటున్నాను,
నేను ఆగామి ఆకాంక్షలను జీవిస్తున్నాను

ఇది నీకు తెలియనిదేమీ కాదు–
ఎన్నో కలలుగనే కన్నులు
నీ వంటి నా వంటి స్వప్నాలు
అల్లుతూనే ఉన్నాయి–
నీవలనే ఈ స్వప్నాల వేర్లు కూడ
మట్టిలో వున్నాయి
యుగాలు ఎంత పొడుగ్గావున్నాయో
అంత పొడుగ్గా
ఎవరూ వీటిని పీకివేయలేరు

నేల ఎంత నెత్తురు పీల్చుకొని
గలుగుతుంది!?
ఆఖరికి, మట్టి కూడ ఎలుగెత్తి చెప్పింది.

నీ స్వప్నాలవలనే, నిరీక్షిస్తూనే
నా కళ్ళు ఒక రోజు నిద్రపోతాయి
కాని ఈ స్వప్నం మేల్కొనే వుంటుంది

నీవు వుంటావు
నేనుంటాను
అందరూ వుంటారు.

(అను: జగత్సత్యం)

"పెట్టుబడిదారి సమాజం ప్లాస్టిక్ పువ్వులాంటిది. అది వాడిపోదు. వేడి చేస్తే కరిగి పోతుంది. వెయ్యి ఎమర్జెన్సీలు దాన్ని కాపాడలేవు."

# జనవాదీ లేఖక్ సంగఠన్* 'హిరావల్' ప్రకటన

ప్రజా విప్లవకాలంలో మిత్రులెవరో శత్రులెవరో పోల్చుకోడానికి, వర్గపోరాటాన్ని గురించిన అవగాహనకు పదనెక్కించి దాన్ని అంతర్యుద్ధ దశకు చేర్చడానికి, చివరకు రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొనే విషయంలో అంతిమ ప్రజాపోరాటానికి ప్రాముఖ్యాన్నివ్వడానికి సాంస్కృతిక, సాహిత్య పత్రికలు కళ్లు, చెవుల పాత్ర నిర్వహిస్తవి. ఈ ఆశయ సాధనకోసమే 'హిరావల్' ఆవిర్భావం.

అన్నిటికంటె ముందు ఒక విషయం చెప్పడం అత్యావసరం. 1967 లో నక్సల్బరీ ఆందోళనతో మొదలై నేటివరకు జరుగుతూ వచ్చిన రాజకీయ, సాంస్కృతిక, పరిణామాల ఆశయాలను వాటి మూల స్వభావాన్ని అభివ్యక్తీకరించాలనే కోరిక 'హిరావల్' ఆవిర్భావానికి కారణం. ఇట్లా అన్నప్పుడు ఇంతకుపూర్వం జరిగిన ప్రజా పోరాటాలను నిర్లక్ష్యం చేసినట్లుగా భావించకూడదు; ఎందుకంటే ప్రతిపోరాటం దానికి ముందు జరిగిన పోరాటన్నుండి ప్రేరణను అంతర్వస్తువును పొందుతూ రాబోయే పోరాటానికి మూల పదార్థాన్నందిస్తుంది. మా రచయితలు పరిణామ శీలమైన ఈ అంతర్వస్తువును మున్ముందు శ్రేష్ఠతరమైన సాహిత్యరూపాల్లో అభివ్యక్తీకరిస్తారు.

రచయితలు కేవలం సాహిత్యాన్ని చూసి, సాహిత్య సృష్టిచేసే సౌలభ్య ప్రియత్వాన్ని విడనాడి, ప్రజా జీవితాన్ని ప్రత్యక్షంగా చూసి కోరదగిన కొత్తకొత్త రూపాల్లో మన ముందుంచుతూపోయినకొలది ప్రజాభిమానాన్ని చూరగొనగల పటిష్ఠమైన ప్రజా సాహిత్యరూపం, లక్ష్యశుద్ధిగల యదార్థతా స్వరూపంగా పరిణతి చెందుతూ, సాక్షాత్కరిస్తుంది. అయితే ఇది ప్రజా జీవితస్వరూపాన్ని కోరదగిన సాహిత్యరూపాలుగా మలచినపుడు, ప్రచారదృక్పథాన్నీ పోరాటస్వభావాన్నీ అవలంబించి వాటిని ప్రజా జీవితపు కొత్త సంస్కృతికి చేరువగా తేవడానికి ప్రయత్నించినపుడుమాత్రమే సాధ్యపడుతుంది. ప్రజా సంస్కృతికి పట్టిన చీడను తుడిచిపెడుతూ అప్రమత్తంగా, స్థిరసంకల్పంతో ముందుకు సాగాల్సిన అవసరాన్ని తక్కువగా అంచనా వేయ వీలులేదు.

అందుకే 'హిరావల్' ఈ భారత ఉపఖండంలో ప్రస్తుత ప్రజాస్వామిక విప్లవ కాలంలో తన నిజమైన ప్రజా సాంస్కృతిక, సాహిత్య పాత్ర నిర్వహణపట్ల స్థిర సంకల్పంతో కన్పిస్తుంది. ప్రస్తుత ప్రజావిప్లవానికి ఇరుసు వ్యవసాయ విప్లవం అని వేరే చెప్పనక్కరలేదు. ఇప్పుడు సంపూర్ణ సాంస్కృతిక నాయకత్వం కొరకు గాక

*ప్రజాస్వామిక రచయితల సంఘం

## నినాదాల రాత్రి
(నారోఁ కీ రాత్)

**శివమంగల్ సిద్ధాంత్‌కర్**

ఈ కవి 1975 మార్చిలో ప్రముఖ హిందీ హిరావల్ వామపక్ష రచయితల సంఘం ప్రకటించిన 'హిరావల్' మొదటి సంపుటానికి సంపాదకుడు.

జాగ్రద్రాత్రుల కారుచీకట్లలో
'సన్నద్ధంకండి' అనే నినాదాలు రాయనే రాయబడ్డయ్
శత్రువు హైరాన పడ్డాడు
ముడ్డి దులుపుకుంటూ లేచి
చెట్లమీద గుండ్లు కురిపించాడు.
కొమ్మలు కంపించినై
ఒక్కసారిగా ఎన్నో ఐతల చల్లబారిన చేతులు వేలాడుతూ
తమదే ఐన మట్టి వైపు
శవాన్నంటి శవం దొర్లుతూ
ముందుకు సాగినై
విజిళ్ళు మోగినై
జాగ్రత్తల కాంక్రీటు మళ్ళీ రోడ్లపై పరుచుకుంది,
నేల పొట్టన పడ్డ మేము
విస్తరించాం
విస్తరిస్తూనే ఉంటాం.

(అను: జగత్సత్యం)

---

ప్రజా సాంస్కృతిక నాయకత్వం కొరకే పోరాటం సల్పాలనే విషయం చెప్పటం కూడా బహుశ అనవసరమే. రాజకీయ అవగాహన శూన్యమైనా తమను తాము ప్రజాస్వామిక వాదులుగా డంబాలు పలికేవాళ్లు అర్థభూస్వామ్య, అర్ధవలస వ్యవస్థలో సంపూర్ణ సాంస్కృతిక నాయకత్వానికి నినాదం ఇస్తున్నారంటే దాన్ని సాధించడం అసాధ్యం చేయ డానికి ప్రయత్నిస్తున్నారనే అర్థం చేసుకోవాలి. దీనితో 'హిరావల్' ప్రస్తుతం ప్రజా సాంస్కృతిక నాయకత్వం కొరకే పోరాటం సల్పుతుందనేది స్పష్టం.

ఈ విశాల భారత ఉపఖండంలోని విభిన్న జాతులమధ్య ప్రజా సాంస్కృతిక, సాహిత్యరంగాల్లో సమైక్యతా స్థాపనకు కృషిచేయడమే 'హిరావల్' ఉద్దేశ్యం. విభిన్న భారతీయ జాతులను అంతర్జాతీయ స్థాయిలో ప్రజాసంస్కృతీ సాహిత్యాలతో సంయో జింపడానికి కృషిచేస్తుంది. ఉపఖండంలోని దగాపడిన పీడిత జనుల నిజమైన సాంస్కృ తిక సాహిత్య సిద్ధులకు గమ్యం నిర్దేశిస్తుంది. మరోవిధంగా చెప్పాలంటే కర్షక, కార్మి

సర్వేశ్వరదయాల్ సక్సేనా కవితలు :

## ఎర్రని సైకిలు

రాత్రింతా
ఒక ఎర్ర సైకిలు
ఇనుప ముళ్ళ తీగెల కంచె నానుకొని
ఒంటరిగా దీనంగా
నిలబడ్డది.
పోలీసు విజిళ్ళ కీచు మోత
నేలపై బరువైన బూట్ల చప్పుడు
ఉదయం
ఒక పిల్లవాడు
చలిమంచుకు తడిసిన సైకిలు గంటతో
ఆడుకుంటూ కన్పించాడు.
అప్పుడు
సైరన్ కూతపెడ్తూ
ఒక పెద్ద నల్లని వ్యాన్
మోతతో వచ్చి ఆగింది
ఆ వ్యాన్ తలపై మెరుస్తూ
వెలుగులూ తిరుగుతున్న
నీలం దీపం ఆకర్షణలో పడి....
పిల్లవాడు గంటను మరచిపోయాడు
ఆ నల్లని వ్యాన్ పిల్లవాణ్ణి
పట్టుకుపోయింది
మొదటిసారిగా
నేలపై కిటికీ చువ్వల నీడల్ని
చూసినపుడు
నా గుండెల్లో నిండింది భయం.

(అను: ఎస్వీజె)

---

కుల, మిగతా పీడిత ప్రజలందరి ప్రజాసంస్కృతీ సాహిత్యాల కొరకు విప్లవాత్మకపాత్ర నిర్వహిస్తుంది. అథోజగత్సహోదరుల సంస్కృతీ సాహిత్యాలతో మేళవిస్తుంది. విప్లవ మలిదశ నందుకోవడానికి ఒందొరులను పరిణత పరచడమే దీని లక్ష్యం.

మన ప్రియతమ మాతృభూకి స్వాతంత్ర్యం సముపార్జించడం, జాతులను విముక్తంగావించడం, ప్రజా విప్లవాలతో సాంస్కృతిక, సాహిత్య భాగస్వామ్యం 'హిరావల్' ముందంజలో ఒక ప్రధానాంగం.

'హిరావల్' తన ప్రణాళికా పత్రాన్ని సవినయంగా సమర్పిస్తూ తన సహచరుల నుండి నిర్దిష్టమైన సూచనలను క్రియాశీల సహకారాన్ని అర్థిస్తున్నది. ఇదే రకమైన ఆలోచనా ధోరణిగల సహచరులంతా తమ మధ్య ఏవైనా చిన్నచిన్న అభిప్రాయభేదాలున్నా ఇరువైపుల నుండి పోరాటం జరుపడానికి సాంస్కృతిక రంగంలో సమాయత్తం కావాలి. అందువల్ల నిరర్థకమైన సాంస్కృతిక, సాహిత్య ధోరణులు సమసి నిజమైన ప్రజా సాంస్కృతిక సాహిత్య నాయకత్వం సాధ్యపడుతుంది.

# అరణ్య వేదన
(జంగల్ కా దర్ద్)

"అడవంటే ఏమిటి?"
ఒకని ప్రశ్న
"మరి నొప్పంటే?"
మరొక గొంతు ధ్వనించింది.

నేను జవాబు చెప్పలేదు–

ఇద్దరినీ ఒక పెద్ద బోనులో
బంధించి
పైన ఒక పల్చటి నల్లదుప్పటి కప్పాను–
కొంత కాలం తరువాత
అడవి జంతువుల మాదిరిగా
చూడ సాగారు నా వైపు
మొదటి వారి కండ్లు
అహింసాత్మక పశువుల కండ్లవలె
పచ్చ బారినై
ఆ తర్వాత పచ్చి నెత్తురు తాగే
క్రూర జంతువుల/చింత నిప్పుల
కండ్లుగా మారినై
వారు ఆకలితో ఉన్నారు.
నేనొక ముద్ద విసిరాను.
అయితే వారన్నాన్ని వదలి
పరస్పరం పెనుగు లాడారు–
రక్త స్నానాలు చేశారు.

బలవంతుడే అంతా స్వాహా చేయగా
బలహీనుడు ఎంగిలి మెతుకులతోనే
సంతోషించి
బాధతో ముఖం చాటు చేసుకున్నాడు.

ఈతంతు చాల రోజులవరకు
కొనసాగ నిచ్చాను–
పొట్ట మాడ్చడం, పిడికెడు మెతుకులు
ముఖాన కొట్టడం
బలవంతునిలో దర్పాన్ని రేకెత్తించడం
బలహీనుణ్ణి తృప్తి పాఠంతో జోకొట్టడం
చివరకు మరే(ఇతర)విషయాన్ని గురించి
ఆలోచించ జాలనంతగా
అలవాటు పడి పోయారు దీనికి
అప్పుడు వాళ్ళను బోనులో నుండి
వెళ్ళగొట్టాను–
ఇప్పుడు పిడికెడు మెతుకులకై నిరీక్షణతో
కొట్లాటకు సిద్ధంగా
స్వేచ్ఛా ప్రపంచంలో నిల్చారు
నిల్చున్నారు
నిల్చుంటారు
దర్పం అల్పసంతుష్టికి గురియై

(అనువాదం: రేగులపాటి మాధవరావు)

---

సక్సేనా – హిందీలో ప్రముఖ కవి. ప్రస్తుతం "దినమాన్" హిందీ పత్రికలో పని చేస్తున్నాడు. కవితా, కథాసంకలనాలు, నాటకాలు ప్రచురితమయ్యాయి. పౌర హక్కుల ప్రజాసమితి రాజకీయ ఖైదీలపై జరిపిన కన్వెన్షన్ (ఆగస్ట్ 77) సందర్భంలో ప్రచురితమయిన 'రక్తబీజ్' హిందీ కవితా సంకలనానికి, సంపాదకత్వం వహించాడు. విప్లవ తెలుగు కవులను కొందరిని హిందీలోకి అనువదించారు. ఈకవిత ఆయన ఎమర్జెన్సీ కాలంలోనే ప్రచురించగల్గిన 'జంగిల్ కా దర్ద్' పుస్తకం నుండి అనువదింపబడింది.

# విరసం ఎలా వుంది? ఎలా వుండాలి?

ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత తిరిగి తన కార్యకలాపాలు ప్రారంభించి ఆరవ రాష్ట్ర మహాసభలు జరుపుకుంటున్న సందర్భంగా విరసం తన ఎనిమిదేళ్ళ చరిత్రను, ఆచరణను ఒక్కసారి ఆత్మావలోకనం చేసుకుంటున్నది. ఈ సందర్భంలో విరసం ఆత్మ విమర్శకు, మిత్రుల విమర్శలు, సూచనలు, సలహాలు కూడ ఉపయోగకరంగా వుంటాయని భావించి సృజన 'సాహితీ మిత్రులు' ఈ క్రింది ప్రశ్నలు తయారుచేసి విరసం మిత్రులుగ భావించిన వారిలో కొందరికి పంపించింది. వారిలో కొందరు పంపించిన సమాధానాలు కింద యిస్తున్నాం. మిత్రుల దగ్గర ఈ ప్రశ్నలు చూసి తమంత తాముగా జవాబులు పంపించిన వారుకూడ ఒకరిద్దరు వున్నారు. ప్రచురిస్తున్న వారి అభిప్రాయాలకు పూర్తిగా పునశ్చరణ అనిపించినవి మాత్రమే వదిలేసాం. ఈ ప్రశ్నలకు ఈ సమాధానాలు, సలహాలు చాలవు అనిపించినవారుగానీ, కొత్తగా చెప్పవలసింది ఉన్నదని భావించిన వారుగానీ, విరసం సభ్యులుకాని ప్రజాస్వామ్య వాదులందరూ తమ తమ అభిప్రాయాలు ఈ 'చర్చావేదిక'కు పంపించ వలసిందిగా ఆహ్వానిస్తున్నాం.

ప్రశ్నలు

1 విరసం ఆవిర్భావం నాటి పరిస్థితుల దృష్ట్యా విరసం ఏర్పాటు గురించి మీ అభిప్రాయం?

2 ఎమర్జన్సీకి పూర్వం విరసం రాజకీయ సంస్థగా మారిందని ఒక ఆరోపణ. మీ అభిప్రాయం?

3 ఎమర్జెన్సీలో విరసం గురించి మీరేమనుకున్నారు?

4 ఎమర్జెన్సీ తర్వాత విరసంకు రాజకీయాలు లేకుండా పోయాయని ఒక అసంతృప్తి. మీ అభిప్రాయం?

5 విరసం ప్రజాసాహిత్యానికీ, సంస్కృతికీ ఏమైనా దోహదం చేసిందని మీరు భావిస్తున్నారా, లేదా?

6 మీ ఉద్దేశ్యంలో విరసం ఎలా వుండాలి?

7 విరసం విస్తృత ప్రజాస్వామ్య వేదిక కావాలంటే మీ సూచనలేమిటి?

సమాధానాలు

1) 'విరసం' స్థాపన ఆనాటి పరిస్థితుల దృష్ట్యా ఉపయోగ పడినదనే నా భావన. రచయితల సంఘం కొనసాగించవలసిన కార్యక్రమాలపై నాకు ప్రత్యేకాభిప్రాయాలు లేకపోలేదు. వివరణ తదుపరి గమనించగలరు.

2) 'రాజకీయ సంస్థ' అనడంలో రాజకీయ పంథాలో పాక్షిక దృక్పథం అవలంబించడం శ్రేయస్కరం కాదని నేను భావించాను. సాధారణ స్థాయిలోనే ఒకానొక రాజకీయ దృక్పథాన్ని ప్రచారంచేయాలి. లోతైన విమర్శలకు, వాగ్వాదాలకు దూరంగా ఉండడం సాహితీపరుల కర్తవ్యం.

3) 'ఎమర్జెన్సీ'లో కార్యక్రమాలు నిలిచిపోవడం మాత్రమే నేను గమనించాను. వివరాలు నాకు చేరలేదు.

4) 'ఎమర్జెన్సీ' ఎత్తివేసిన పిదప రాజకీయ వాతావరణం సర్వత్రా అస్తవ్యస్తంగా ఉంది. పునరాలోచన అవసరం. అందువల్ల నిర్దుష్టమైన దృక్పథం లోపించి ఉండవచ్చు. ఒకందుకు యీ మార్పు సరిఅయినదే.

5) 'విరసం' ప్రజాసాహిత్యానికి 'ఏమైనా' అనడం దేనికి ఎక్కువగానే దోహదం చేసిందని నా అభిప్రాయం. అయితే మార్పులు కూడా అవసరం.

6) 'విరసం' నిర్వహణలో రెండు అంశాలలో మార్పు రావలసి ఉంటుంది.

(i) 'విరసం' సాహిత్య సంస్థ కనుక కేవలం రాజకీయ అవగాహన, వివరణ మాత్రమే కాక కళాత్మక విలువలు పాటించాలి. ఎక్కువగా సాహిత్య విమర్శపైన, భారత దేశంలోని యితర ప్రాంతాలు, అధునాతన విశ్వసాహిత్యంపై వ్యాసాలు, సమాచారం అందించాలి. కథలు, కవితలు కూడా అవసరమే కాని 'ప్రజాసాహిత్యానికి' విస్తృతమైన నిర్వచనం అమలు పరచి సామాన్య పాఠకుల కర్థంగాని మాండలిక పదజాలాన్ని రాజకీయ రంగానికి చెందిన సాంకేతిక పరిభాషను తక్కువగా వాడితే సాహితీపరులకు పత్రిక ఆసక్తికరంగా ఉంటుంది.

(ii) 'విప్లవం' అనే పదానికి నేటి రాజకీయ పక్షల దృక్పథానికి విభిన్నమైన 'విప్లవాత్మక భావాలు' అనే అర్థంలో గ్రహించి యువతరం హర్షించే భావాలన్నిటికీ ప్రాతినిధ్యం కల్పించాలి.

7) విరసం విస్తృత ప్రజాస్వామ్య వేదిక కావాలనడంలో ఉద్దేశ్యమేమిటో నాకర్థం కావడంలేదు. ప్రజా ఉద్యమాలను బలపరచడం వాటిపై వ్యాఖ్యానించడం అవసరమే కాని ప్రస్తుతానికి 'విరసం' విప్లవాత్మక భావాలకే పరిమితం చేయాలి. నా అవగాహన ప్రకారం యీ సంస్థ ఎన్నికలు, సమ్మెలు, ఊరేగింపులు, పార్టీ రాజకీయాలు వీటి కతీతమైన నిజమైన ప్రజా ఉద్యమాల అభివృద్ధికి కృషిచేయాలి.

డాక్టర్ ఎస్. వి. ఎస్. రావు
మైసూరు 18

1) ఒకప్పుడు ప్రజా రచయితలకు వేదికగా వుండే అరసం క్రమంగా సంస్కరణ వాదులకూ అవకాశ వాదులకూ కీర్తి కాంక్షాపరులకూ వేదికగా మారింది.

ఇంకొక వేపు తెలుగు సాహిత్యరంగంలో రకరకాల కొత్త ధోరణులు (దిగంబర కవులు, తిరగబడు కవులు_ మొదలైన ధోరణులు) ప్రవేశించాయి.

తర్వాత కాలంలో (1967_70) దేశవ్యాప్తంగా ప్రజలు అనేక విప్లవోద్యమాల లోకి కదిలారు. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లోని రైతాంగం భూస్వామ్య దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా పెద్దయెత్తున కదిలింది (నక్సల్బరీ, శ్రీకాకుళం, తూర్పు గోదావరి మొ॥ ప్రాంతాల్లో). పట్టణ ప్రాంతాల్లో కార్మికులూ, విద్యార్థులూ మధ్యతరగతి ప్రజలు కూడా అధికధరలు, జీతాల పెంపు, నిరుద్యోగం వంటి సమస్యలమీద తీవ్ర స్థాయి పోరాటాలద్వారా తమ వ్యతిరేకత వ్యక్తం చెయ్యడంతోపాటు రైతాంగ వుద్యమాలకు కూడా పెద్దయెత్తున అండదండ లిచ్చారు.

సామాజిక జీవితంలో వచ్చిన ఈ గొప్ప చైతన్యమే సాహిత్యరంగంలోనూ ప్రతిబింబించింది.

ప్రజా వుద్యమాల వల్లా, వాటికి నాయకత్వం అందిస్తున్న రాజకీయాల వల్లా వుత్తేజితులైన రచయితలూ, సాంస్కృతిక కార్యకర్తలూ ఒక ప్రజాసాహితీ సాంస్కృతిక సంస్థగా సంఘటిత పడడానికి తగిన వాతావరణం ఏర్పడింది.

ఇలాంటి సమయంలో ఇలాంటి వాతావరణాన్ని కలుషితం చేసే వుద్దేశంతో సంస్కరణవాదులూ అవకాశవాదులూ కొందరు కలిసి అరసాన్ని పునరుద్ధరించే ప్రయత్నాలు చేశారు. (1970 లో)

ఇటువంటి పరిస్థితుల్లో విరసం ఏర్పాటు చాలా సహజమైన తప్పనిసరి పరిణామం.

'విశాలమైన వేదిక' పేరుతో అవకాశవాదులకూ సంస్కరణవాదులకూ కేంద్రంగా తయారైన అరసంనించి విడిపోయిన వారూ, అరసంతో సంబంధం లేకుండా వున్న కొందరూ కలిసి "విరసం"గా ఏర్పడ్డం సంతోషించదగ్గ విషయం.

కానీ, "మార్క్సియన్ సోషలిజమే ధ్యేయం"గా వున్నవారికీ, మార్క్సిజాన్ని శాస్త్రంగానే గాక శస్త్రంగా ఆమోదించే వారికీ మాత్రమే పరిమితమైన సంస్థగా విరసం ఏర్పడడం లోనే దాని బలహీనత ప్రారంభమైంది. భూస్వామ్య విధానాన్నీ సామ్రాజ్యవాదాన్నీ నిర్మూలించి ప్రజాతంత్రయుతమైన సమాజ నిర్మాణమే ధ్యేయంగా పెట్టుకుని

ప్రజలు పోరాడే సమయం అది. అలాంటి పరిస్థితుల్లో, దోపిడీని వ్యతిరేకిస్తూ భూస్వామ్యవిధానాన్ని పూర్తిగా రద్దుచేసి 'దున్నేవానికే భూమి వుండాలని' భూమికోసం పోరాడే రైతాంగ పుద్యమాన్నీ, వారి ప్రయోజనాన్నీ తమ రచనలలో చిత్రించే రచయితలు వుంటారు. నిరుద్యోగం, అధిక ధరలు, నిరక్షరాస్యత, దారిద్ర్యం వంటి సమస్యలకు స్పందించి రాసే రచయితలు ఎప్పుడూ వుంటారు- కొందరు స్త్రీల సమస్యల మీదనే, కొందరు "అంటరాని" ప్రజల సమస్యల మీదనే అపారమైన సానుభూతితో రచనలు చేసేవారు వుంటారు. ప్రజలలో అనేక మిత్రవర్గాలు వున్నప్పుడు ఆయా వర్గప్రయోజనాల్ని ప్రతిబింబించే రచయితలు తప్పనిసరిగా వుంటారు.

ఈ రచయితలంతా తమ సాంఘిక రాజకీయ చైతన్యాన్ని బట్టి రకరకాల స్థాయిలలో వుంటారు. వీరు "మార్క్సియన్ సోషలిజాన్నే ధ్యేయం"గా ఎంచుకోపోయినప్పటికీ వీరంతా దోపిడీ పీడనలను తమ సాహిత్యం ద్వారా రాజీలేని విధంగా వ్యతిరేకించేవారే- ఇలాంటి ప్రజారచయిత లందర్నీ ఐక్యం చేయాల్సిన బాధ్యత మాత్రం మార్క్సియన్ సోషలిజం ధ్యేయంగా వున్న రచయితలదే. ఆ పని అంతకన్నా తక్కువ స్థాయి చైతన్యం గల రచయితలు చేయలేరు.

వివిధ రకాల చైతన్య స్థాయిలలో వున్న ప్రజా రచయితలను సమీకరించే పని జరగ వలసి వున్నప్పుడు "మార్క్సియన్ సోషలిజం మన ధ్యేయం" అని ప్రణాళికలో ప్రకటించడం అంటే ఆ ధ్యేయం కల రచయితలకు మాత్రమే ఆ సంస్థను పరిమితం జేసి, మిగతా ప్రజా రచయితలందర్నీ ఆ సంస్థనించి దూరంగా వుంచడమే అవుతుంది.

మార్క్సియన్ సోషలిజాన్ని ధ్యేయంగా పెట్టుకున్న రచయితలకు ఒక ప్రత్యేక సంస్థ వుండకూడదనో, వుండక్కర లేదనో దీని అర్థం కాదు. విరసం ఏర్పడిన నాటి పరిస్థితుల్ని దృష్టిలో వుంచుకుని చూసినప్పుడు (అనాటికీ కాదు- ఈనాటికీ) మార్క్సియన్ సోషలిజాన్ని ధ్యేయంగా పెట్టుకుని ఏర్పడిన సంస్థ ప్రజా రచయిత లందరికీ సంబంధించిన వేదిక కాలేదన్నది మాత్రమే దీని అర్థం. ఆ విషయాన్ని గమనించలేని వ్యక్తులు మార్క్సియన్ దృక్పథం కలవారుగా వుండలేరు.

మార్క్సియన్ దృక్పథం అంటే చారిత్రక పరిస్థితులకు అనుగుణమైన రీతిలో పుద్యమాలను నిర్మించగల దృక్పథమే. సాహిత్యోద్యమంలోనికి ప్రజా రచయిత లందర్నీ సమీకరించే అభిప్రాయం విరసానికి వుందో లేదో అర్థంకాని విధంగా విరసం తన ప్రణాళికను రూపొందించుకుంది. "మార్క్సియన్ సోషలిజమే మనందరి ధ్యేయం" అని ఒకచోట "వలస భూస్వామ్య, ధనస్వామ్య అవశేషాలన్నిటినీ తొల

గించి నూతన ప్రజాస్వామ్య స్థాపనకు తోడ్పడడమే మా వుద్దేశ్యం" అని ఇంకోచోటా చెప్పి సామాజిక విప్లవంలో రెండు దశల మధ్య తేడాని గమనించక వాటిని ఏకం చేసింది.

విప్లవ రచయితల వేదికగా వుండదల్చిన సంఘానికి సాహితీ సాంస్కృతిక రంగంలో తను నిర్వర్తించాల్సిన విప్లవ కర్తవ్యాలపట్ల తగినంత స్పష్టత వుండాలి. ఆ సాంస్కృతిక విప్లవ కర్తవ్యాలు, సామాజిక విప్లవ కర్తవ్యాలకు అనుగుణమైనవి గనక, మొదట సామాజిక విప్లవదశల పట్ల స్పష్టమైన అవగాహన వుండాలి. సామాజిక విప్లవానికీ, సాంస్కృతిక విప్లవానికీ మధ్య వుండే సంబంధం గురించీ, విప్లవ రచయితల సంస్థ అనుసరించాల్సిన కార్యాచరణ విధానం గురించీ కూడా స్పష్టత వుండాలి. 'విప్లవ' రచయితలు వ్యక్తులుగా తమ నిత్యజీవితంలో అవకాశవాదానికీ, కీర్తికాంక్షకీ అశాస్త్రీయ సంస్కృతికీ లొంగకుండా మెలిగేందుకు మార్గదర్శకమైన 'ప్రవర్తనావళి'ని ఏర్పరచుకోవాలి- ఈ లక్షణాలన్నీ ప్రతీ సంస్థకీ పుట్టుకతోనే రాక పోవచ్చును. విరసం ప్రారంభమైన నాటికి ఈ లక్షణాలేవీ దానికి లేకపోయినా మొదటి మహాసభనాటికి ఈ లోపాల్ని, తప్పు ప్రాతిపదికనీ సవరించుకుని వుండాల్సింది. కాని, అలా జరగలేదు.

కనక, విరసం ఏర్పాటు ఒకరంగా సాహిత్యోద్యమానికి మేలు కలిగించే విషయమే అయినా, అది ప్రజా సాహిత్యోద్యమానికి తగినంతగా తోడ్పడలేని బలహీనతలతో పరిమితులతో ప్రారంభమైంది.

2) సాయుధ పోరాటమే ఏకైక పోరాట రూపమనీ, మార్గమనీ ప్రచారంచేయడం; చైనా పేరునీ, మావో పేరునీ, విప్లవ నినాదాలనీ పదేపదే జపంలాగా యాంత్రికంగా ప్రస్తావించడం; భూస్వాముల్ని వ్యక్తులుగా నిర్మూలిస్తే భూస్వామ్య విధానం పోతుందని భ్రమింపజేసే వర్గశత్రు నిర్మూలనా కార్య క్రమాన్ని ప్రచారంచేయడం; సాహితీ, సాంస్కృతిక విప్లవ కర్తవ్యాలని సమర్థవంతంగా నిర్వహించడానికి తోడ్పడే విధంగా రాజకీయాలతో సంబంధం పెట్టుకోడానికి బదులు, సాంస్కృతిక రంగాన్ని వొదిలి విప్లవ రాజకీయాల్లో పాల్గొనడాన్నే ప్రధాన కర్తవ్యంగా ప్రచారం చేయడం; ప్రజా రచయితలందరికీ వేదికగా గాక విప్లవ కమ్యూనిస్టు రాజకీయాల్లోని కొన్ని ధోరణులకు ముఖ్యంగా వ్యక్తిగత హింసావాద రాజకీయాలకు- ప్రాతినిధ్యం వహించే వారికే పరిమితమైన సంస్థగా మరింత సంకుచిత పడడం – ఈ విషయాలే గనక ఆ "ఆరోపణ" కు కారణాలైతే, ఆ ఆరోపణ పూర్తిగా న్యాయమైనదే. సహజమైనదే.

3) ఎమర్జన్సీలో విరసం సభ్యులు విరసానికి రాజీనామాలివ్వడం, ప్రభుత్వానికి అండర్ టేకింగులు రాసివ్వడం, సంస్కరణవాద సాహితీ సంస్థల్లో చేరిపోవడం,

ఇందిరా ప్రభుత్వంలో వామ పక్ష భావాలు చూడడం, ఎమర్జన్సీనీ, 20-సూత్రాల్ని కీర్తించడం ఇలాంటి దిగజారుడు వ్యవహారా లన్నిటికీ-విరసం ఏర్పాటునుంచీ ఎమర్జన్సీ వరకూ విరసంలో వున్న లోపాలే చాలావరకూ కారణం అనుకున్నాను.

ప్రజల ప్రయోజనాలకు తోడ్పడే సాహితీ సాంస్కృతిక కార్య కర్తల్ని విశాల మైన పరిధిలో సమీకరించడానికి అవకాశంలేని పరిణామంతో వుండడం; ఉన్న ప్రణా ళికనైనా అమలుపరిచే చిత్తశుద్ధీ, నిజాయితీలే నివారికి సభ్యత్వాలివ్వడం, ఆచరణలో ఏ బాధ్యతలూ తీసుకోని వారికి పదవులు కట్టబెట్టడం, వ్యక్తిగత జీవితంలో పచ్చి అవకాశ వాదులుగా, చెడు ప్రవర్తన కలవారుగా, అశాస్త్రీయ దృక్పథం కలవారుగా ఎన్నో సంద ర్భాల్లో రుజువైన వారిని సంస్థలో కొనసాగనివ్వడం; సభ్యుల క్రమశిక్షణ విషయంలో సంస్థ పట్టుదలగా వుండక పోవడం-ఇటువంటి సంస్థాపరమైన లోపాలే ఏ సంస్థలో నైనా దిగజారుడు వ్యవహారాలకు కారణ మవుతాయి.

సరైన సిద్ధాంతాన్ని ఆధారం చేసుకుని సరైన ఆచరణకు తోడ్పడే కార్యక్రమాన్ని విరసం నాయకత్వం అందించలేక పోయిందనే విషయం ఎమర్జన్సీ కాలంలో మరింత స్పష్టంగా వెల్లడైంది.

4) ఎమర్జన్సీకి పూర్వం విరసం రాజకీయ సంస్థగా మారిందనే 'ఆరోపణ'కు ఏ విషయాలైతే ఆధారమో, ఆ విషయాల్లో కొన్ని ఇప్పుడు విరసంలో లేకపోవడం, కొన్ని పాతరూపాల్లో కనబడకపోవడం ఈ 'అసంతృప్తి'కి కారణం కావచ్చు.

ఇలాంటి అసంతృప్తి వ్యక్తపరిచే వాళ్ళంతా ఎమర్జన్సీకి పూర్వం విరసంలో హానికలిగించే ధోరణులేవైతే వుండేవో వాటిని అవే రూపాల్లో కొనసాగించాలని కోరే వాళ్ళే.

5) ఉత్తమమైన ప్రజా సాహిత్యంగా ఎంచదగిన కొన్ని రచనలకు విరసం దోహదం చేసింది. ప్రజల సమస్యల్ని, పోరాటాల్ని చిత్రించిన పాటలు వచ్చాయి. వస్తువు దృష్టితో చూసినా వుత్తమంగా పరిగణించదగ్గ కవితలు వెలువడ్డాయి. ప్రజల జీవితాల్ని చిత్రించే కథలూ, నాటకాలూ రాయడానికి ప్రయత్నాలు జరిగాయి.

ఒకవేపు సాహిత్యోద్యమానికి తోడ్పడే సరైన సాహిత్యం వెలువడినా, దానిని మించిపోయే విధంగా వుద్యమానికి హాని కలిగించే ధోరణులకు విరసం ప్రోత్సా హాన్నిచ్చింది.

విప్లవ కవిత్వంపేరుతో-ప్రజల చైతన్యస్థాయితో, పోరాటానుభవాలతో సంబంధం లేని కవిత్వాన్ని గొప్ప చెయ్యడం; విప్లవ కార్య కలాపాల్ని 'రొమాంటిక్' గా చిత్రిం

చడం; స్త్రీలనీ, స్త్రీపురుష సంబంధాల్నీ నీచపరిచే పదజాలాన్ని విరివిగా వాడడం– వీటన్నిటినీ విరసం ప్రోత్సహించింది. అంతేగాక, సాహిత్యోద్యమానికి సంబంధించిన అనేక విషయాల గురించి(ఉదా॥ నిబద్ధతా–నిమగ్నతా, విప్లవ రాజకీయాలతో రచయితల కుండే సంబంధం వంటి విషయాల గురించి) తప్పుడు సూత్రీకరణలు చేసి ప్రచారంలో పెట్టింది. [విరసంలో వుండిన వారి ధోరణి అంతా ఇదే అనికాదు. గుంటూరు జిల్లా యూనిట్ వారు "సాంస్కృతిక విప్లవం – మన కర్తవ్యాలు" అనే పుస్తకంలో సూచించిన దృక్పథం సరైనదిగానే వుంది.]

ఈ ధోరణి ఇలా వుండగా ఎన్ని సంవత్సరాలు జరుగుతున్నా విరసం ఇతర ప్రజా రచయితల్ని సమీకరించే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు. (వుదా॥ నా రచనల స్వభావం అభివృద్ధి నిరోధకమైనది కాదు. నావంటి రచయితల్ని విరసంలోకి సమీకరించే ప్రయత్నాలేమీ జరగలేదు. 1972 లో గుంటూరులో జరిగిన విరసం సభలకు నేను రావడం కేవలం యాక్సిడెంటల్‌గా జరిగింది.)

6, 7) ఈ రెండు ప్రశ్నలకూ జవాబు ఒకటే. మొదటి అయిదు జవాబులలోనే ఈ ప్రశ్నలకు జవాబు వుంది. ఆ జవాబుల్లో చూపిన లోపాలు లేనివిధంగా విరసం వుండాలి. అప్పుడే అది విస్తృత ప్రజాస్వామ్య వేదిక కాగలుగుతుంది.

గత ఏడేళ్ళగా విరసంమీద, విరసంలో వున్నవారినించీ, విరసానికి బైటవున్న వారినించీ ఎన్నో విమర్శలు వచ్చాయి. వాటిలో కొన్ని శాస్త్రీయమైనవిగా, సంస్థ అభివృద్ధికి తోడ్పడేవిగా వున్నాయి. అటువంటి నిజమైన విమర్శల్ని పరిశీలించి చిత్తశుద్ధితో నిజాయితీతో ఆత్మవిమర్శ చేసుకుని సంస్థను సరిదిద్దుకోవాలి.

– రంగనాయకమ్మ

1) విరసం ఆవిర్భావం సమయోచితం. ముఖ్యంగా తెలుగునాట ఆనాడున్న అయోమయస్థితిలో (సాహిత్యంలో, రాజకీయాల్లో) వుత్తేజం కలిగించటానికి 'మార్క్సియన్ శోషలిజమే మా ధ్యేయం' అనగలిగిన ఒక రచయితల సంఘం అవసరం ఎంతైనా వుంది. [పై ధ్యేయం మనసులో వుంచుకునీ పైకి చెప్పలేని సంస్థల అవసరం ఏనాడో తీరింది కూడ]

2) రాజకీయ సంస్థగా మారి వుండక పోవచ్చునేమో గాని, రాజకీయ సంస్థలాగ మరీ గిరులుగీసుకుని 'నిబద్ధతలూ, నిమగ్నతలూ' అంటూ పోయి ఆ విధమైన ఆరోపణలకు తావిచ్చింది. రచయితలు రాజకీయవేత్తల్లా కాకుండా స్వేచ్ఛ ఎక్కువ కోరతారు.

మరీ ఒకే మూసలో వుండాలని ముఖ్యంగా రచయితల్ని నిర్దేశించలేం. పైన చెప్పిన ధ్యేయం మేరకి ఏకీభవించిన వారందరిని కలుపుకు పోతే సరిపోతుంది. విశ్వనాథల్ని, కృష్ణశాస్త్రుల్ని కలుపుకుపోవడంలో అభ్యుదయం లేదేమోగాని, రావి శాస్త్రుల్నీ, శ్రీశ్రీన్నీ కూడ దారుణంగా విమర్శించడం అవివేకం. మొదటి ఇద్దర్లో అభ్యుదయం వుందో లేదోగాని, చివరిద్దరూ నిజంగా సోషలిజాన్ని నమ్మినవారే.

3) ప్రతి ఒక్కరికీ ఎమర్జన్సీ షాక్ నుండి తేరుకోవడం చాలాకాలం పట్టింది. విప్లవ రచయితలూ 'అతివాద' శ్రేణిలో పడ్డారనే నిందవలన ఎమర్జన్సీలో బహిరంగ గా చేయగలిగిందేమీ లేకపోయింది. [అయినా, నర్మగర్భంగా కూడ చెప్పనిచ్చే వాళ్ళు కాదుగనక చింతలేదు]

4) విరసం రాజకీయ సంస్థ అంతగా మారాలన్నవారికి అసంతృప్తి వుందేమోగాని, ఐక్యసంఘటన ధ్యేయంగా ఇకనైనా కవిత్వం, రచనలూ, విరసం సభ్యులు సాగిస్తే మేలని నమ్ముతా. జనానికి దూరంపోయి రాజకీయ చర్చలు జరిపితే ప్రయోజనం లేదు. 40 సం॥ నాడు రాసిన శ్రీశ్రీ గేయాలు చదివితే ఇప్పటికీ ఆశ్చర్యంగావుంది– 1938 కే యిలా రాయగలిగాడా అని. అలా రచనలు సాగించండి.

5) విరసం చేసిన సేవ మరువలేం. విరసం ఆవిర్భావం ఒక ఆలోచనకు పదును పెట్టింది. అప్పటి రచనలకన్నా ఆ రచయితలవల్ల ఆ రకమైన ఆలోచనకు గౌరవ భావం కలిగిందేమో.

6) (i) ఐక్యసంఘటనతో, (ii) శాస్త్రీయసోషలిజమే మా ధ్యేయం అని చెప్పగలిగే వాళ్ళందరినీ కలుపుతూ, (iii) రచనల్లో కొత్త అందాలో, దారులో చూపుతూ 'కథా వస్తువు ఏదైనా విరసం వాళ్ళు చాలా గొప్ప కవులు, రచయితలు' అన్న కీర్తిని సంపాదించాలనీ, రాజకీయాలు ఎరగనివాళ్ళు కూడ వీరి శక్తికి ముగ్ధులై వచ్చి చివరకు ధ్యేయాన్ని కూడ ఒప్పుకునేలా చేయాలని, (iv) కోడిగుడ్డుమీద వెంట్రుకలు ఏరటం (hair splitting) మానాలనీ కోరతా.

7) విరసం మారదలచుకుంటే ఆ సంగతి పూర్తూరా ఏర్పాటుచేసే కార్యక్రమాల ద్వారా తెలిసేలా చేయాలి. ఏ మీటింగులో ఏ విషయం మీద చర్చ ఏర్పాటు చేసినా చర్చల సారాంశం సోషలిజం ధ్యేయంతోనే జరిగినా అందర్నీ కలుపుకుపోయేలా ఉండాలి.

చర్చ ఎక్కడసాగినా చివరికందరు సోషలిజాన్ని ఒప్పుకుంటారీరోజుల్లో. కాని దానిపట్ల, అది సాధించే మార్గంపట్ల అవగాహన పెంచాలి. 'ప్రచార సాహిత్యం' అని నిందించినా జడవక్కర్లా. అట్లా అని అంతా అదే కానక్కర్లా.

ప్రతి ఊళ్ళో అభ్యుదయవాదుల్తో విరసం ఆధ్వర్యాన చర్చలు, సాహిత్య గోష్టులు తరుచు జరపాలి. యువ రచయితలను రప్పించి వారి కవిత్వం కథలు విని, సభికుల అభిప్రాయాలు చెప్పి వాటిని మెరుగు పర్చటంలాటి వర్క్‌షాప్‌లు నడపాలి. జనంమధ్యకెళ్లి తాము ప్రజల కెంత దగ్గరగా ఉన్నామో, దూరంగా ఉన్నామో పరిశీలించుకుంటూ ఉండాలి.

– వేణుగోపాలరావు టి.
విజయవాడ

1) ఆనాటి పరిస్థితుల్లో వి.ర.సం ఏర్పాటు స్థూలంగ సరియైనదే.

2) ఆ ఆరోపణలో కొంత వాస్తవముంది. విరసం ప్రధానంగ Revolutionary Philosophyని విప్లవ రచనల ద్వారా ప్రజలలోకి తీసుకుపోవలసి యుండగ విప్లవ రాజకీయాల Strategy and tactics ని గురించిన చర్చల్లో ఎక్కువగ involve అయింది. ఇది సరియైనది కాదని నా అభిప్రాయం.

3) Emergencyలో విరసం దాదాపు ఒక నిస్తబ్ధతలో పడిపోయింది. దానికి తోడు కొంతమంది విరసం ప్రముఖులు విరసానికి చాలా అవమానకరమైన పద్ధతుల్లో ప్రకటనలు చేశారు; ప్రవర్తించారు.

4) దీనికి సమాధానం కొంతవరకు రెండవ దానిలో ఉంది. The Proto Political activities of the Pre-emergency days are not there any more. Hence the discontent. ఐతే ఈ అసంతృప్తి పూర్తిగ సమర్థనీయం కాదు.

5) వి.ర.సం, ప్రజా సాహిత్యానికి సంస్కృతికి తప్పకుండ దోహదం చేసింది. ఐతే ఇది ముఖ్యంగ కవిత్వము, పాటల విషయంలో ఎక్కువగ కృషిచేసింది.

6) పైన రెండవదానిలో చెప్పినట్టు Revolutionary Philosophyని వి.ర.సం. సాహిత్య సాంస్కృతిక రూపాల్లో ప్రజల్లోకి తీసుకుపోవలసింది. ఇంతకుముందులాగ కవిత్వము, పాటల విషయంలోనేగాకుండ మిగిలిన సాహిత్యరూపాల్లో కూడ ముఖ్యంగ నాటకాలు, నాటికలు తర్వాత నవలల విషయంలో కూడ విరివిగ కృషి చేయాల్సింది. పాటల్ని, నాటకాల్ని వి.ర.సం. తన వేదిక ద్వారా పల్లె ప్రజల వరకు చాల విస్తృత ప్రాతిపదికపైన తీసుకుపోవాలి,

7) వి.ర.సం. ఈ ఆశయాలకు అనుగుణంగ ఉన్నంతవరకు ఇతర సాహిత్య సాంస్కృతిక సంస్థలతో (అ.ర.సం.తో సహా) కలసి పనిచేయడానికి అభ్యంతరం ఉండవలసిన అవసరంలేదు. Liberal intellectuals తో కూడ మైత్రీభావము వహించి వాళ్లను కూడ వి.ర.స. activities లో involve చేయాలి.

– పినాకపాణి

**1)** భారతదేశంలో తెలంగాణా సాయుధ పోరాటానికి ముందునుంచే విప్లవ పరిస్థితి నెలకొని వుంది. మహత్తరమైన ఆ పోరాటానికి రివిజనిస్టులు వెన్నుపోటు పొడిచినా, విప్లవ పరిస్థితులు వెనుకంజ వేయకుండా మరింతగా పరిపక్వ స్థితికి చేరుకొన్నాయి. 1967 లో నక్సల్బరీలో వసంతమేఘ గర్జన అందుకు తిరుగులేని తార్కాణం. ఈ దేశంలో పీడిత ప్రజల విమోచనకోసం కొనసాగాల్సిన జనతా ప్రజాస్వామిక విప్లవానికి ఎర్ర జెండామాటున ఉభయ కమ్యూనిస్ట్ పార్టీలు ద్రోహంచేసి, తెలంగాణ సాయుధపోరాట అమరవీరుల త్యాగాల్ని పార్లమెంటరీ పందుల దొడ్డిలో సీల్లుగా మార్చుకొని, పీడితవర్గ రాజకీయాలని నిలువులోతు రివిజనిస్ట్ వూబిలోకి త్రొక్కి, దళారీ బూర్జువా, భూస్వామ్య వర్గాల తొత్తుగామారి, ప్రజా జీవనంలోని అన్ని రంగాలలోని పోరాటాలను నీరుగార్చుతున్న తరుణంలో, ఏశ్రామికవర్గ త్యాగాలతో ఎర్రజెండా అంత ఎరుపెక్కిందో ఆ అరుణిమను నిలిపేందుకు ఆ ఆశయ సాధకులై, మార్క్సిజం-లెనినిజాలకు పట్టిన చీడను వదలించి, జనతా ప్రజాస్వామిక విప్లవాన్ని తుదకంటా కొనసాగించేందుకై ప్రారంభమైన మహోన్నతమైన నక్సల్బరీ పోరాటాన్ని, ఆ ఒరవడిలో ప్రారంభమైన యితర వర్గపోరాటాలని సమర్థించాల్సిన కర్తవ్యం ఆ క్షణాన దేశంలోని దేశభక్తియుత శ్రామిక వర్గ కళాకారు లందరిమీద వుంది. అయితే రాజకీయాల్లోని రివిజనిస్ట్ చీడ రచయితల సంఘాల్లోకి ప్రవేశించి, విదేశీ విప్లవాన్ని కీర్తిస్తూ (ప్రమాదం లేదు కనుక) స్వదేశంలోని వర్గపోరాటాలని ఖండిస్తూ అనేక రచయితల సంఘాలు బతుకుతున్న తరుణంలో, విప్లవ పోరాటాలని సాహిత్యంలో ప్రతిబింబించేందుకు, సాహిత్యంలో వచ్చే విప్లవాత్మక మార్పులని ఆహ్వానించేందుకు, సాహిత్యంలో రాజ్యం ఏలుతున్న శ్రామిక వర్గ వ్యతిరేక, ఫ్యూడల్ పెట్టుబడిదారీ ధోరణులని ఖండించేందుకు ఒక మిలిటెంట్ రచయితల సంఘ ఆవిర్భావ ఆవశ్యకత ఏర్పడివుంది.

అనాడు నక్సల్బరీ రైతాంగ పోరాటాన్ని ఖండించిన కుహనా మేధావులే, విరసం ఆవిర్భావాన్ని ఖండించేది. నిజానికి అనాడున్న వాస్తవ పరిస్థితుల్లో నక్సల్బరీపోరాటం ఎంత అవశ్యకమని చరిత్ర రుజువు చేసిందో, విరసం ఏర్పడటంకూడా అంతే అవసరమని, 8 ఏళ్ళ విరసం చరిత్ర, కృషి తెలియచేస్తున్నాయి.

**2)** విరసం ఏనాడూ రాజకీయ సంస్థకాదు. విరసం మానిఫెస్టో నుంచి ఆచరణదాకా కూడా మొత్తం సాహితీ స్వరూపాన్నే సంతరించుకొని వుంది. దేశంలో కొనసాగుతున్న రాజకీయ పోరాటానికి మద్దతుగా, ప్రజల భావాలని విప్లవీకరించేందుకు, ఆ పోరాటాల అవసరాన్ని సాక్షి చెప్పేందుకు, ఆ అరుణారుణ వీరుల త్యాగాన్ని అక్షర

బద్ధం చేయటం ద్వారా వర్తమాన తరాన్ని కర్తవ్యోన్ముఖుల గావించేందుకు, భావి తరాలని వుత్తేజపరచేందుకు, ప్రజా పోరాటాలని ప్రజా భాషలో పదునుగా చెప్పేందుకు విరసం కృషి చేసింది. రాజకీయ సంస్థలతో పోటాపోటీగా సాగిన యీ కృషిని అవగాహన చేసుకోలేక యీ రెంటినీ ఒకటిగా కొద్దిమంది గందరగోళపడి వుండవచ్చు. అలానే ప్రజా సాహిత్యంలో అడుగులేయటం మొదలెట్టిన విరసం కొన్ని పొరపాట్లు చేసింది. విరసం సభ్యులు ఆ వేదికను తమ గ్రూపు రాజకీయాలను ప్రచారం చేసుకొనేందుకు సంకుచితంగా వ్యవహరించారు. దాని ఫలితమే విరసం వేదికలమీద భిన్న గ్రూపుల ఎత్తుగడల పంథాను వివరించే గేయాలు, కథలు, మరీముఖ్యంగా నినాదాలు వినిపించాయి. కొద్దికాలం యీ ధోరణులు పెచ్చరిల్లాయి. బహిరంగ సభలలో సైతం యీ గ్రూపు తగాదాలు అసహ్యాన్నే, రోతనే కలిగించాయి. అయితే క్రమంగా యీనాటికి ఆ నెగిటివ్ ధోరణిని విరసం వదిలించుకొన్నట్లే కన్పిస్తోంది. ఈ కొద్దిపాటి నెగిటివ్ అంశంతో విరసం పాజిటివ్ అంశమైన మొత్తం సాహితీ కృషిని త్రోసిరాజని, యీ ఆరోపణ చేయటం దారుణం. ఆ ఆరోపణే నిజమయితే విరసం ప్రచురణలుగా ఎరుపు, కళలూ-సారస్వతం ఎవరికోసం, ఝంఝు ఇప్పుడు వీస్తున్నగాలి, కిరణాలు, అరుణతార లాంటివికాక, చారుమజుందార్ రచనలు, మా మౌలిక పంథా - ఎత్తుగడలు లాంటి డాక్యుమెంట్లు విడుదలయివుండేవి. అయితే ఒక విషయంస్పష్టం. "ఆర్థిక రాజకీయ వ్యవస్థల ప్రతిబింబమే సమకాలీన సంస్కృతీ స్వరూపాన్ని నిర్ణయిస్తుంది" కాబట్టి, వాటి గురించిన సమగ్ర అవగాహన విరసం సభ్యుల కుండాలి. ఆ మేరకు విరసంకు ఒక స్పష్టమైన రాజకీయ లక్ష్యం వుంది- వుండాలి. అదే శ్రామికవర్గ విముక్తి లక్ష్యం. యీ లక్ష్యం విసహాయించిన నాడు విరసం అస్తిత్వానికే అర్థం లేదు. ఒక మహోన్నతమైన లక్ష్యంకోసం సాగుతున్న పోరాటంలో భాగంగా విరసం మిలిటెంట్ సాంస్కృతిక సైన్యంగా పురోగమిస్తుంది. ఈ పోరాట శక్తులకన్నిటికీ చెందిన సాంస్కృతిక ప్రతినిధిగా, విప్లవకర ఐక్యసంఘటనగా విరసం కొనసాగుతుంది. ఈమేరకు విరసం తన ఆచరణను రూపొందించుకొంటుంది. ఈ కృషిని ఒక రాజకీయ సంస్థ ఆచరణతో పొరపాటు పడకుండాచూసే సామాన్యులకి విరసం పీడిత ప్రజల 'కలాల సైన్యం' గానే ఒక మిలిటెంట్ సాహితీ సంస్థగానే కనబడుతుంది.

3) ఎమర్జన్సీలో విరసం అవసరం మరింతగా అనిపించింది. అప్పుడు దేశంలో నెలకొనివున్న భయోత్పాతక (ఫాసిజం), భ్రమాత్మక పరిస్థితి (ఆర్థిక రంగం)ని తేటతెల్లంచేసి, యీ మొత్తం పరిస్థితికి వ్యతిరేకంగా తిరగబడాల్సిందిగా ప్రజలను వుత్తేజపరచాల్సింది. దేశంలో సాగాల్సిన అంతర్యుద్ధ పోరాటాన్ని గురించి నొక్కిచెప్ప

జనం మెదళ్ళలో కొత్తరక్తాన్ని ఇంజెక్ట్ చేయాల్సివుంది. ఇదంతా రాజకీయపార్టీల పనైనా, మొత్తం పని ప్రజాబాహుళ్యానికి చెందినది కాబట్టి, తన పరిమితుల మేరకు విరసం ఆ పని చేయాల్సివుంది. యీ ఎమర్జన్సీ వర్గస్వభావాన్ని వివరిస్తూ, 1947 నుంచీ యీ దేశంలోని కార్మిక-కర్షక, మధ్యతరగతి వర్గాలమీద అప్రకటిత ఎమర్జన్సీ ఎలా వుందో చెప్పాల్సి వుంది. విరసం నిర్మాణం, సంఖ్యాబలం రీత్యా యిది అసాధ్యమై పోయింది. ఉన్న కొద్దిపాటి అవకాశాన్నయినా విరసంలో జైలుబయట వున్న సభ్యులు వినియోగించు కొన్నట్లు కనిపించదు.

జైలులోని విరసం రచయితల వైఖరి గురించి చెప్పాల్సివస్తే: ఎమర్జన్సీలో జైల్లో చిక్కుబడ్డ అనేక వర్గాల ప్రజల గురించి ఆలోచించాల్సి వుంది. యీ కొద్దిపాటి నిర్బంధానికే బేజారైపోయి తమ గుండె చప్పుళ్ళకే భయపడుతున్నవారిని నైతికంగా నిలబెట్టాల్సిన బాధ్యత ఆయా రాజకీయ పార్టీలతోపాటు విరసంకీ వుంది. నిర్బంధితుల మధ్య చైతన్యదీపికగా విరసం వెలుగొందాల్సి వుంది. కాగా వాస్తవం అందుకు భిన్నంగానే వుంది. విరసం రచయితలలో ఎక్కువ మోతాదులో రాజకీయ చైతన్యాన్ని ఆశిస్తాం. సాధారణ జీవితాన్ని గడుపుతూ ఆదర్శవంతంగా వుంటారని వూహిస్తాం. దిగజారిన వాళ్ళకు స్థైర్యాన్ని కలిగిస్తారనుకొన్న విరసం మిత్రులు కొంతమంది దారుణంగా దిగజారి పోయారు. తెలిసి ఫాసిజాన్ని, ఫాసిస్టు ఆర్థిక సూత్రీకరణలని సమర్థించారు. ఎవరి చీకటి గదుల్లో వాళ్ళుండిపోయారు. ఎవరినో వుద్ధరించటం కాక, విరసం బాధ్యులు తమ సభ్యులని, సానుభూతిపరులనీ చైతన్య పరుచుకోవాల్సి వచ్చింది. యీ తరుణంలో కొద్దిమంది మాత్రమే నిర్బంధాల్ని అధిగమించి వున్నత ప్రమాణాలని నిలబెట్టారు. కటకటాల వెనక సైతం విరసం సాహితీ కృషి కొనసాగించింది. అందుకు ప్రతీకగా నిలిచిపోతాయి ఆనాటి లిఖిత పత్రికలు. ఆ పత్రికలు ఎన్నో ఆటంకాలు తప్పించుకొని జైలు వెలుపలకి వెళ్ళి కొంత ప్రచారం చేసాయి. యీ కృషిలో భాగం పంచుకొన్న కార్యకర్తలే విరసంకు Main force. విరసంలోవున్న రచయితల వర్గ పునాది ఏమైనప్పటికీ, క్రమంగా వాళ్లు డిక్లాస్ కావాల్సివుంది. కాని విరసం రచయితలలో వర్గదృక్పథం లోపించటం, పీడిత ప్రజానీకంతో మమేకం కాకపోవటం, అధ్యయనంపట్ల అలసత్వం, ఆచరణలో (సిన్సియారిటీ వుండీ) చొరవలోపించటం.... యీ లోపాలు సవరించుకోవల్సి వుంది. పీడిత వర్గంగురించి (అరసంలా) కేవలం కవిత అల్లటంకాక, వాళ్ళజీవితల్లో జోక్యంకలిగించుకొంటు, వాళ్ళ బాధలు పంచుకోనే స్థాయికిరచయితలు ఎదగాల్సివుంది. విమర్శతోపాటు. చిత్త శుద్ధితో కూడిన ఆత్మవిమర్శ

అనునిత్యంపాటించాల్సివుంది. యీ ఎమర్జన్సీ గుణపాఠాలని దృష్టిలో పెట్టుకొని, భవిష్యత్ ఫాసిజంలో బ్రతికి బట్టకట్టేలా సంస్థనినడిపిస్తారని ఆశించటం హాస్యాస్పదంకాదనుకొంటాను.

**4)** ఈ ఆరోపణ నిరాధారమైందనుకొంటాను. విరసం మానిఫెస్టోలో వర్గ పోరాటాన్ని బలపరచననేవైఖరిలేదు. పైగా ఎమర్జన్సీ తర్వాత కొద్దిరోజులలో విరసం తన ప్రథమహాసభను జరుపుకోబోతోంది. పెనుగాలి తాకిడికి చెల్లా చెదరై పోయిన తన యంత్రాంగాన్ని ఒకచోటకు సమీకరించుకొనే యత్నంలో వుంది. విరసం తరఫున వెలువడ్డ రెండు అరుణతార సంచికలలోనూ వర్గ సామరస్య ధోరణులు లేవు. ఒకప్పుడు విరసంలో అంతా రాజకీయమే అన్న మితవాదులదీ, యివాళ అసలే రాజకీయాలులేవు అంటున్న 'అతి' అతివాదులదీ అంతిమంగా ఒకేజాతి. విరసం ఒక వర్ధమాన మిలిటెంట్ సాహితీ సంస్థగా వర్థిల్లటం యిష్టంలేని ప్రబుద్ధులు వీళ్లు.

**5)** 1970 నుంచి యీ నాటివరకూ సాగిన కృషిని క్లుప్తంగా నైనా సమీక్షించటం సాధ్యంకాదు. (నాకున్న స్వల్ప వ్యవధిలో) [వి] శ్రీనాథుల నుంచి రంధి సోమరాజుల సాహిత్యందాకా విస్తరించివున్న, అరసంసాహిత్యంలో మునిగి తేలుతున్న కొందరు రచయితలకు చాలా మంది యువతరానికి Life boat లా చేతికి చిక్కింది "విరసం." ప్రాణాన్ని లెక్కచేయక ఒక నూతన సమాజ ఆవిష్కరణ కోసం నిప్పుల నదిని యీదుతున్న వీరుల త్యాగాన్ని ఒక స్పష్టమైన కమిట్‌మెంట్‌తో విరసం కీర్తించి, దానివల్ల ఎదురయిన అనేక నిర్బంధాల్ని నిర్భీతిగా ఎదుర్కొంది. విరసం సభ్యులని అనేక కుట్ర కేసులలో యిరికించి, వాళ్ళ కుటుంబాలని అష్టకష్టాల పాలుచేసినా, ఎన్ని సంకలనాలు నిషేధించినా, వూపిర్లమీద ఎన్ని నిర్బంధాల్ని విధించినా, నిషేధాల్ని నిషేధించి విరసం కృషి కొనసాగించింది. రివిజనిస్ట్ రాజకీయాలమీద రాజీలేని పోరాట ధ్వజమెత్తిన రాజకీయ పార్టీలకు బాసటగా నిలిచింది. సాహిత్యంలో ప్రవేశించిన రివిజనిస్ట్ భావాలని చీల్చి చెండాడింది. ప్రజల నాలుకలమీద ఆడే జానపద సాహితీ కళారూపాలని చేబట్టి జనం హృదయాలలోకి మిలిటెంట్ భావాలని చేర్చింది. బూర్జువా సంస్కృతికి శ్రామికవర్గ సంస్కృతికి మధ్య స్పష్టమైన విభజన రేఖ గీస్తూ ముందుకు సాగుతోంది. సాహిత్యంలో ఎర్రజెండాను ఎగరవేసింది. నిషేధాలు అధిగమిస్తూ, రెట్టించిన వుత్సాహంతో విప్లవ సాహిత్యాన్ని (పరిమితంగానైనా) ప్రజలకు చేర్చింది. రాజకీయ పోరాటాలతో ఉత్తేజితమైన నవయువతకు వుషారిచ్చింది. "జాతికి ఛాతీ" లాంటి యువతరంలో భావవిప్లవం రేపి, ముందుకు నడిపించింది. పాణిగ్రాహి, చినబాబు,

పరిటాల లాంటి కళాకారులు శత్రు కిరాతకానికి బలైపోయినా, విరసం కంటి చిత్తడి వొత్తుకొంటూనే, కొత్త త్యాగాల యువతరాన్ని తిరిగి రిక్రూట్‌చేసే కృషిలోనిమగ్నమై వుంది. ఈ దోపిడీ ప్రభుత్వం సంగతటుంచి, ప్రభుత్వేతర సంస్థలనుంచి ఎన్ని తీరుల విరసంపై దాడి జరిగిందో పరిశీలిస్తేనే తెలుస్తుంది, విరసం ఎవరికోసం అన్నది; అంతేకాదు సాహితీ సాంస్కృతిక రంగాలలో విరసం కృషి కూడా అర్థమవుతుంది.

జముకుల కథ, వొగ్గు కథ, డప్పు వాయిద్యం, బుర్రకథల నుంచి అనేక రీతుల ప్రజాకళారూపాలు చాలా చైతన్యవంతంగా వేదికనెక్కాయి. సాహితీరంగంతో పోటీగా సాంస్కృతిక రంగం కృషి చేసింది. యిందుకు నిదర్శనంగా జననాట్యమండలి, అరుణోదయ, నవోదయ సంస్థలు నిలుస్తాయి.

విరసం మిత్ర పత్రికలుగా సృజన, జీవనాడి వాటి వాటి పద్ధతుల్లో ఎనలేని సాహితీ కృషి కొనసాగించాయి. సృజనమీద రాజద్రోహ నేరాలకు అంతేలేదు. విరసం కృషికి, చేవకు విరసంపై శత్రునిర్బంధం తిరుగులేని సాక్ష్యం. విరసం సాధించాల్సిన దానికన్నా సాధించింది స్వల్పమైనా, అది నిర్లక్ష్యం చేయతగింది కాదు.

6) ఈ అయిదు ప్రశ్నలకి రాసిన జవాబుల్లోని అంశాలే యీప్రశ్నకు ఒక మేరకు సమాధానం అవుతాయి.

విప్లవరచనలక్ష్యం దోపిడీ వర్గానికి వ్యతిరేకంగా సాగే మిలిటెంట్ పోరాటాలని సమర్థించడమే. "వర్గసంఘర్షణ, జాతీయపోరాటం నుంచి విప్లవభావాలు పుడతాయి" కాబట్టి విరసంరచయితలు శ్రామికవర్గ దృక్పథం అలవర్చుకోవాల్సివుంది. యిందుకుగాను శ్రామికవర్గ జీవనస్రవంతిలో మమేకంకావాల్సివుంది. సాహిత్యానికి అవసరమైన ముడి పదార్థం ప్రజాజీవితం కాబట్టి, ప్రజల మధ్యకు వారి ప్రత్యక్షపోరాటాల నెట్టనడిమికి రచయితలు పోవాల్సివుంది. ప్రజల అశాస్త్రీయ ఆలోచనా సరళిని చక్కదిద్దేందుకుగాను, ముందుగా రచయితలు చాలా లోతైన శాస్త్రీయ దృక్పథం కల్గివుండాలి. మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానాన్ని 'సజీవంగా' అధ్యయనం చేయటం అలవరచుకోవాలి. పోరాట సాహిత్యాన్ని నలుగురికి ప్రజారీతులలో అందించాలి.

సంఖ్యాబలంకోసం కాక, సంస్థ భవిష్యత్‌ని దృష్టిలో వుంచుకొని, సిన్సియారిటీ ప్రధానంగా సభ్యులని చేర్చుకోవల్సివుంది. ఉత్సాహంగా ముందుకువచ్చే యువతను, తమ పరిమితుల మేరకు అనుబంధంగా చిన్న రచయితల సంఘాలు ప్రారంభించమని చెప్పి, వారున్న పరిసరప్రాంతాలలో పనిచేయమని చెప్పాలి. ఆ కృషిని పరిశీలించిన

తర్వాత, వారిని విరసంలో చేర్చుకొంటే బావుంటుందనుకొంటాను. మార్క్సిజం- లెనినిజంకి చెందిన మౌలిక సూత్రాలు అందరూ అధ్యయనంచేసేలా, అందుకు విరసం బాధ్యులు ప్రాతిపదిక కల్పించాల్సి వుంది. యీ అధ్యయనం ఆచరణతో జోడింపబడి నపుడు (ఏమేరకైనా) సభ్యులలో బలమైన వర్గదృక్పథం చోటుచేసుకొని, కష్టాలకు సవాల్‌గా నిలుస్తారు. సాహితీ విలువలు ఎలావున్నా, సాహితీ వస్తువు శ్రామిక పక్ష పాతిగా వున్నప్పుడు, ఆయా రచయితల సాహితీ రీతి మెరుగుపడేందుకు నూతన రచ యితలకు విరసం తోడ్పాటు నివ్వాల్సివుంది. ముఖ్యంగా అట్టడుగువర్గాల నుంచి ఎంత సభ్యత్వం వృద్ధి ఏడు వుంటోంది విరసం చూసుకోవాల్సివుంది.

విరసం మహాసభలు పెద్దపట్టణాల్లో జరగటంవల్ల కార్యనిర్వాహకులకు కొంత వెసులుబాటు వున్నప్పటికి, అప్పుడప్పుడైనా యీ సభలు పల్లెల్లో జరగాల్సివుంది. అటు దేశానికి యిటు పోరాటానికి ఆయువు పట్టయిన పల్లెల్లో విరసం చేయాల్సిన కృషికి యీ సభలు ఎంతో దోహదం చేస్తాయి. సభల నిర్వహణలో చాలా మెలకువగా తెలివిగా, ప్రజల సున్నితమైన మనోభావాలని పరిగణనలోకి తీసుకొంటూ వ్యవహరిం చాల్సి వుంటుంది. మొరటు విమర్శలస్థానే, సున్నితంగా ప్రజలు చాలా లోతుగా ఆలోచించేలా వివరించాల్సుంటుంది. విరసం సభ్యులు కూడా అన్నిరకాల పెట్టుబడిదారీ విష సంస్కృతీ చిహ్నాలేవీ లేకుండా పల్లెల్లో రైతాంగంతో కలగలిసేలా వుండాలి.

విరసంలో వుదారవాదానికి చోటులేకుండా వుండాలి. ఒకరిద్దరు నిష్ఠాతులైన పెద్దవారివల్లే సంస్థ నిలబడుతుందనే భ్రమలకు విరసం నాయకత్వం దూరంగా వుండాలి. ఆ భ్రమలేవీ లేవని మాటల్లో అనడంకాక, చేతల్లో నిరూపించుకోవాలి. లోగడ శ్రీశ్రీ పట్ల వుదారవాదాన్ని విరసం ప్రదర్శించింది. గత తప్పులన్నీ తీవ్రంగా ఖండించ లేకపోగా, ఎమర్జన్సీలో ఆయన వైఖరికి యీరోజుకీ ఆయన నుంచి నిర్దుష్ట మైన, ఆత్మవిమర్శనాయుత సంజాయిషీ పొందలేకపోయింది. యిచ్చిందాంతో తృప్తి పడి యింకా సభ్యునిగా శ్రీశ్రీని కొనసాగనివ్వటం విరసానికి శాశ్వతంగా మిగిలిపోయే మచ్చ. కొ.కు. యివాళ పత్రికలలో కలిగిస్తున్న గందరగోళంపై ప్రజలు అనేక విమ ర్శలు చేస్తున్నా, కార్యదర్శి నుంచి ఎలాంటి సమాధానంలేదు. ఆ భావాలపై అరుణ తారలో వ్యాసాలు లేవు. ఎన్నో అశాస్త్రీయ భావాలపై పిడుగులు కురిపించే విమర్శ కులు, కొ.కు.వి ఎందుకు వదిలేశారు? ప్రధానంగా వున్న స్వీయాత్మక భయాలు, వాటి నధికంచేసే వుదారవాదం నుంచి విరసం దూరంగా వుండాలని ఆశిస్తాం.

సాహితీ సమితికి సైతం ఒక నిర్మాణరూపం వుండనుకుంటే, ఆ నిర్మాణాన్ని నిర్బంధాలకు తట్టుకొనేలా రూపొందించుకోవాల్సి వుంది. ముఖ్యమైన నిర్ణయాలు పిచ్చాపాటీగా చర్చించుకొనే సాంప్రదాయానికి విరసం స్వస్తి చెప్పాల్సి వుంటుంది.

విరసం తన మిత్రులెవరు? శత్రువు లెవరు? అని తేల్చుకోవల్సివుంది. తప్పులు చేస్తే మిత్రుల పట్ల వాళ్ళని సవరించేలా, వాళ్ళు మరింత శాస్త్రీయంగా ఆలోచించేలా, వాళ్ళ మనసు కుంగని రీతిలో విమర్శించాలి. స్పష్టంగా మిత్రుల పొరపాట్లు తెలియ చేయాలి. ఆ విమర్శ చంద్ర నిప్పులు చెరగకుండా వుండాలి. పాలక వర్గ రచయితల సంఘాలు + రివిజనిస్ట్ సంఘాలని మినహాయించి, అరకొరగావున్న సంస్థలలోని రాడికల్ యువ రచయితల పట్ల యీ వైఖరి ప్రదర్శించవచ్చు. అలానే విరసం సభ్యుల పట్ల యీ వైఖరి వుండాలి. యిందుకు భిన్నమైన వైఖరి, దోపిడీ వర్గానికి వూడి గం చేసే కలాల సైన్యం పట్ల వుండాలి. విరసం విమర్శకులు తమ మూడో కన్ను వీళ్ళపై తెరవచ్చు.

విరసం సాహిత్యం విస్తృత ప్రజా బాహుళ్యంకోసం కాబట్టి, జానపద రీతు లని ఎక్కువగా వుపయోగించుకోవల్సివుంది. అక్షరాస్యులని, నిరక్షరాస్యులని దృష్టిలో వుంచుకొని విరసం సాహితీ కృషి కొనసాగించాలి. చిన్న కథలు, కవితలు, పాటలు వ్యంగ్యరూపకాలు యిందుకు బాగా వుపకరిస్తాయి. నాటకాలు, బుర్రకథలు, నృత్య రూపాకాలు, పాటలు ద్వారా నిరక్షరాస్యులని చైతన్య వంతుల్ని చేయొచ్చు. యీ రెండు (పత్రికలలో రాయటం, చెప్పటం) చాలా సరికైన రీతులుఎంచుకోవాలి. అధ్యయన బృందాలుగా విరసం రచయితలు ఏర్పడి, ప్రజా భాషను పరిశీలించాలి (ఎలక్ట్రానిక్ యింత్రస్టుతో కాక)

విరసం మిత్రులు కొన్ని పుస్తకాలు తప్పక పరిశీలించాల్సి వుంది. 1. సాహి త్యంపై లెనిన్ భావాలు 2. మావో ఏనాన్ వుపన్యాసాలు 3. చైనాలో సాంస్కృ తిక విప్లవంపై వెలువడ్డ రచనలు – ముఖ్యంగా వాటికి మావో ముందు మాట. 4. సృజన–డిసెంబరు 71 సంచికలో సార్త్ర్ వెలిబుచ్చిన భావాలు అలానే మరికొన్ని ప్రామాణిక గ్రంథాలు.

అచ్చు పత్రికలు తీయలేనపుడు లిఖిత పత్రికల ద్వారా కార్మికుల మధ్య కృషి ప్రారంభించ వచ్చు. కార్మికులు పోరాటాలకు, ఆందోళనలకు దిగినపుడు రచయితలు వారి మధ్యకు నడవాల్సివుంది.

సం॥రాని కొకసారి ఆత్మ విమర్శ విరసంలో వుండాలి. అధ్యక్షుని మంచి సామాన్య సభ్యుని వరకు ఒకే క్రమశిక్షణ నియమావళి వుండాలి.

విరసం పోరాట సాహిత్యం వుత్పత్తి చేయాల్సివుంది. యీ పోరాటాల ప్రచార వేదికగా పని చేయాల్సివుంది. అన్ని రకాల వర్గ పోరాటాలని విరసం బలపరచినట్లే జనతా ప్రజాస్వామిక విప్లవాన్ని బలపరచాల్సివుంది. ఆ మేరకు మానిఫెస్టోలో స్పష్ట మైన ప్రకటన వుండాలి. విస్తృత ప్రజాస్వామ్య వేదిక పేరున నానా గోత్రీకుల విడిది సత్రం విరసం కాకూడదు.

విరసం సభ్యులు హేతువాదులు, గతితార్కిక భౌతికవాదులుగా ఐ వుండటం ఒక షరతుగా వుండాలి.

– అల

I విరసం ఆవిర్భావంనాటి పరిస్థితులు:

1) ఫ్యూడల్ సంస్కృతి అనేక కొత్తరూపాల్లో పాలకవర్గాల అధీనంలో ఉన్న అన్ని ప్రచారసాధనాల ద్వారా కొనసాగించబడుతున్నది.

2) సామ్రాజ్యవాద సంస్కృతి కూడా అనేక రూపాల్లో దేశంలో ప్రచారం చేయ బడుతున్నది.

3) పై రెండు సంస్కృతులను సమూలంగా రద్దుచేయటానికి కృషిచేయక కొన్ని పద్ధతులు మాత్రమే (కులాంతర వివాహాలు, బాల్య వివాహాలు, వరకట్న వ్యతిరేక కార్యక్రమాలు మొ॥) చేపట్టి ప్రచారంచేస్తున్న సంస్కరణవాదులు రంగంలోఉన్నారు.

4) అసలు నేటి సామాజిక వ్యవస్థను గుర్తించకుండా పైపైన కనబడే అశాస్త్రీ యమైన భావాలకు వ్యతిరేకంగా ప్రచారంచేసేవారు, దేవుడు - మూఢనమ్మకాలు మొ॥ పోకుండా వ్యవస్థలో మార్పురాదని ప్రచారంచేసే నాస్తికవాదులు కూడా రంగంలో ఉన్నారు.

5) 1946_51 లో సాగిన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటకాలంలో స్పందించి ప్రజల చైతన్యానికి తోడ్పడే రచనలుచేసి విప్లవకరమైన పాత్ర నిర్వహిం చిన అరసం తరువాత సంస్కరణవాద ఊబిలో దిగబడి అభ్యుదయం ముసుగుతో పాలకవర్గాల పల్లకీ మోతను చేపట్టింది.

6) అలాంటి పరిస్థితులలో తెలుగు సాహితీరంగంలో విరసం ఆవిర్భవించింది. కొద్దికాలంలోనే తెలుగు నోట బహుముఖంగా ప్రచారంలోకి వచ్చింది. చెప్పుకోతగ్గ సంఖ్యలో కవులను రచయితలను ఆకర్షించింది. మరెందరినో తయారుచేసింది.

కనుక అనాటి పరిస్థితుల దృష్ట్యా విరసం సరైన అదను సమయంలోనే ఆవిర్భవించింది.

II 1) విరసం ఏర్పడిన తరువాత ఎంతో సాహిత్యం వెలుగులోకి వచ్చింది. అయితే సాంస్కృతికోద్యమాన్ని సరైన పద్ధతుల్లో నడిపించడంలో అనాటి విరసానికి సరైన అవగాహన లేనందున ఆ విధంగా వెలువడిన సాహిత్యంలో అనేక తప్పుడు ధోరణులు బయటపడ్డాయి.

ఆ తప్పుడు ధోరణులు: A. ఈ వ్యవస్థ మారాలంటే భూస్వాములను వ్యక్తులుగా ఖతం చేయడమన్న దృక్పథంతో చాలా సాహిత్యం వచ్చింది. దీనికి ఉదాహరణలుగా 'సృజన' పత్రికలో కోకొల్లలుగా దొరుకుతాయి.

B. నినాదాలతో కూడిన సాహిత్యాన్ని ఎక్కువ చేయడం జరిగింది గానీ ప్రజల చైతన్యాన్ని పెంచడానికి ఉపయోగపడే సాహిత్యం రాలేదు.

C. ప్రజలకి చైతన్యం కలిగించే సాహిత్యాన్ని అందించాల్సిందిపోయి చివరికి ప్రజల్ని దూషించే సాహిత్యాన్ని కూడా విప్లవకర సాహిత్యంగా ప్రచారం చేసారు.

2) ఒక రాజకీయ సంస్థకు ఎలాంటి నిబంధన లుంటాయో అలాంటి నిబంధనలను విరసం ప్రణాళికలో ఉంచారు. ఈమధ్యగా కొత్తగా విడుదలచేసిన ప్రణాళికలో కూడా అదే ధోరణి ఉంది. మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనావిధానం అంగీకరించినవారు మాత్రమే విరసం సభ్యులు కాగలుగుతారు. అంటే విరసం ఒక ప్రజావేదిక కాదని తేలిపోయింది. కాబట్టి దానికి అనుగుణంగానే అనంతపురం మహాసభలనాటికి దాని అసలు స్వరూపాన్ని బహిరంగ పరచుకొంది. వ్యక్తిగత హింసావాదాన్ని అనుసరించే ఒక రాజకీయ గ్రూపుకి ప్రాతినిధ్యం వహించే సంస్థగా విరసం కుంచించుకుపోబడింది. దానితో జరగవల్సిన సాంస్కృతికోద్యమానికి తీరని ద్రోహంచేసింది. అందుకే కొందరు సభ్యులు విరసంకు రాజీనామా ఇచ్చి బయటకు వచ్చారు.

III 1) ఎమర్జన్సీలో విరసం నిర్బంధానికి గురైంది.

2) కొంతమంది ముఖ్యులు జైళ్ళలో నిర్బంధించబడటంతో విరసం కార్యకలాపాలు పూర్తిగా బంద్ అయినాయి. ఎమర్జన్సీ అంతటి కాలంలో ఏ ఒక్క కార్యక్రమం తీసుకోలేదు.

3) అంటే ఒక ప్రజా సంస్థగా తన ఉనికిని విరసం పూర్తిగా కోల్పోయిందనటానికి ఇంతకన్న వేరే నిదర్శనం అవసరం లేదు.

4) ఎప్పుడైతే విరసం సాహితీ సాంస్కృతిక రంగాలలో తన కర్తవ్యాల ఎడల పట్టాలు తప్పిందో అప్పటి నుండే అది నీటిలో నుంచి ఏరివేయబడ్డ చేపలాగా గిలగిల కొట్టుకుట్టాడుతున్నది. కనుక ఎమర్జన్సీ కాలంలో కనీస కార్యక్రమాన్ని కూడా చేపట్ట లేకపోయింది.

5) అంతేకాక విరసం నాయకులు, సభ్యులు అయినవారు ప్రభుత్వ నిర్బంధ కాండకు తట్టుకోలేక అనేక పరిస్థితులలో లొంగుబాటును ప్రకటించారు. దీనికి ప్రధాన కారణం సరైన విప్లవ అవగాహనతో వారు ప్రయాణం కొనసాగించక పోవడమే. కొందరు నిర్బంధానికి తట్టుకొని నిలబడ్డారు.

6) అయితే విరసానికి చెందినవారు ఒక్క ఎమర్జెన్సీ కాలంలోనే నిర్బంధానికి గురికాబడలేదు. అంతకు ముందు చాలామంది నిర్బంధించబడ్డారు. అయితే ఆ నిర్బం ధాలకు గురైన సందర్భాలలో ఎక్కువ భాగం అతివాద పదజాలంతో, దూషణలతో సాంస్కృతిక కార్యక్రమాలు ఇచ్చి నిర్బంధానికి గురయ్యారు.

IV 26_1_78 నాటి విరసం కార్యవర్గ తీర్మానంచూస్తే నిజంగానే విరసానికి ఒక నిర్దిష్టమైన రాజకీయాలు లేవని స్పష్టమౌతుంది.

సాహితీ, సాంస్కృతిక రంగాలలో నెరవేర్చవలసిన కర్తవ్యాలను ప్రక్కకు నెట్టి ఎన్నికల పట్ల విరసంవైఖరి ప్రకటించి గతంలో బహిష్కరణ పిలుపునిచ్చి ఈ సారి విరసంలో విభిన్న ధోరణులు ఉన్నందువల్ల ఈ విషయం యెడల సభ్యులకు స్వేచ్ఛ నివ్వబడిందని ప్రకటించారు. అంటే విరసంలో గందరగోళం కొనసాగు తుందని తెలుస్తూనే ఉందికదా! విరసం ఒక ప్రజా సంస్థగా కాకుండా కొన్ని గ్రూపు రాజకీయాలు ప్రతి బింబించే సంస్థగా తయారైంది. కాబట్టి విరసం సాహితీ సాంస్కృతిక సంస్థగా సరైనపంథాలో ప్రయాణించడం లేదు.

V 1. అరసం పాలక వర్గాల బాకా రాయుడుగా మారిపోయిన తరువాత ప్రజా సంస్కృతికై పోరాడ వలసిన అవసరాన్ని విరసం ఆవిర్భవించి విప్లవ రచయితల కర్తవ్యాన్ని గుర్తింపజేసింది.

2. ప్రజా సాహిత్యానికి సంస్కృతికి విరసం చేసిన దోహదం చాలా స్వల్పం ఎక్కువగా హానినేకలిగించింది. కారణం ప్రజాజీవితాన్ని లోతుగా పరిశీలించే కర్త వ్యాన్నిమాని, కొన్ని రాజకీయ గ్రూపుల జేబు సంస్థగా తయారై _ వ్యక్తి గత హింసావాద సాహిత్యాన్ని, నినాదాల పూరిత సాహిత్యాన్ని ఉత్పత్తి చేసింది.

3. అయితే కొన్ని ఉత్తమ రచనలు కూడా వచ్చాయన్నది నిజం.

4. విరసం అనధికార పత్రికగా చెలామణి అవుతున్న సృజన మాసపత్రిక వ్యక్తిగత హింసావాదాన్ని ప్రోత్సహించే గేయాలు, పాటలు, కథలు విరివిగా ప్రచారం చేసింది. విరసం అతివాద సాహిత్యాన్ని పనికట్టుకొని ప్రచారం చేసింది. ఆవిధంగా ప్రజాసాహిత్యానికి, సంస్కృతికి దోహదం చేయకపోగా ద్రోహం చాలా పాళ్ళలో చేసింది.

VI 1. ఎమర్జన్సీ తరువాత విడుదల చేసిన విరసం ప్రణాళిక మొదటి ప్రణాళిక కొనసాగింపే- యే రకంగా మార్పులేదు. సంస్థకు ప్రణాళిక ప్రధానం కనుక- ఆ ప్రణాళిక ఆధారం విరసం ప్రజాసంస్థగా పనిచేయలేదు.

2. కనుక ప్రణాళిక మొత్తంగా మార్చవలసిన అవసరం ఉంది-

– విరసం రచయితల సంఘం వరకే పరిమితంగా ఉంటే ప్రజా సంస్కృతికై సాగే పోరాటంతో తన కర్తవ్యాన్ని నెరవేర్చలేదు. కనుక సాహితీ, సాంస్కృతిక రంగాలలో తన కృషిని సమపాళ్ళలో కేంద్రీకరించాల్సి ఉంటుంది.

– మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం అంగీకరించిన వారు మాత్రమే సభ్యులు కాగలుగుతారంటే విరసం ప్రజా వేదిక కాజాలదు. కనుక- ఫ్యూడల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులను కూడగట్టుకొని సాహితీ, సాంస్కృతికోద్యమాన్ని అభివృద్ధి చేయగలిగిన సంస్థగా ఉండాలి.

– నేటి సామాజిక విప్లవంలో ఒక భాగంగా దానికి దోహదపడే విధంగా సాహితీ, సాంస్కృతికోద్యమం సాగుతున్న అవగాహన కలిగిఉండాలి.

– దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా సాగే ప్రజా పోరాటాలను అన్నిరూపాలలో ప్రచారం చేసి ప్రజలలో చైతన్యాన్ని రగుల్కొల్పే విప్లవ సంస్థగా మనగలగాలి.

VII 1) విరసం ఈనాటి ప్రణాళికతో కొనసాగితే ప్రజాస్వామ్య వేదిక ఏమాత్రం కాజాలదు.

2) విరసం విస్తృత ప్రజాస్వామ్య వేదిక కావాలంటే విరసం సమూలంగా మారాల్సిన అవసరం ఉంది.

– మార్క్సిజం - లెనినిజం మావో ఆలోచనా విధానం అంగీకరించిన వారు మాత్రమే విరసం సభ్యులు కాగలరంటే అది పూర్తిగా ప్రజాస్వామ్య వేదిక కావటానికి ప్రధాన ఆటంకమైన అంశం.

- కొన్ని రాజకీయ పార్టీల, గ్రూపుల రాజకీయాలను ప్రతిబింబించే సంస్థగా చలామణి అయినంతకాలం;

- ఫ్యూడల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక, సంస్కృతులకు వ్యతిరేకంగా కలిసివచ్చే శక్తులన్నింటినీ సమీకరించి సంఘటితంగా ఉద్యమించనంతకాలం;

- రచయితల సంఘం వరకే పరిమితమై సాంస్కృతిక రంగాన్ని విస్మరించినంతకాలం;

- విమర్శ - ఆత్మవిమర్శ సత్ సాంప్రదాయాన్ని సరైన పద్ధతులతో కొనసాగించనంతకాలం;

- ప్రజలపై సాగే దోపిడీ, దౌర్జన్యాలను వారి పోరాటాలను పరిశీలించి, వాటిని అన్ని రూపాల్లో ప్రజలకు ఎత్తిచూపి వారిలో పోరాట చైతన్యాన్ని రగుల్కొల్పగల ఎడతెగని ప్రజా ఉద్యమ సంస్థగా మారలేనంతకాలం;

- ప్రజా సాంస్కృతికోద్యమానికి హానికల్గించే ధోరణులను అప్రమత్తంగా ఉండి తిప్పికొట్టగల స్థాయికి చేరుకోనంతకాలం విరసం ప్రజాస్వామ్య వేదిక కాజాలదు.

కావున పై చెప్పిన అంశాలన్నింటిని నెరవేర్చ గలిగిన సంస్థగా రూపొందిననాడే అది విస్తృత ప్రజాస్వామ్య వేదిక కాగలుగుతుంది.

విప్లవాభినందనలతో

- కనకమేడల రవీంద్రకుమార్

మీరిచ్చిన ప్రశ్నలన్నీ ఒకదానితో మరొకటి సంబంధం కలవి. అందువల్ల ఒక్కొక్క ప్రశ్నకు విడిగా నేను జవాబివ్వ దలచుకోవడం లేదు.

మావో ఆలోచనా విధానంలో విశ్వాసంలేని ఏ వ్యక్తినీ సభ్యునిగా చేర్చుకోమని విరసం ప్రణాళికలో వున్నట్టు నాకు తెలిసింది.

మావో ఆలోచనా విధానం మార్క్సిజానికి ఏ విధంగానూ భిన్నమైనదని నేను అనుకోను. విప్లవకాలంలో చైనాలోని నిజపరిస్థితులపై మావో రచనలు ఆధారపడి వున్నాయి. భారతదేశంలోను, చైనాలోను పరిస్థితులు ఒకేవిధంగా వున్నాయనే అభిప్రాయాన్ని నేనామోదించను. ఎవరైనా ఈ రెండు దేశాల్లోని పరిస్థితులు ఒకేలాగ వున్నాయని అనుకుంటే, ఆ వ్యక్తి ఊహాలోకంలోనే వుండి ఏదో సాధించినట్టు భ్రమ పడే వాడు మాత్రమే అనుకోవాలి; ఈ ఆలోచనల ఆధారంగా విప్లవంకై సందడి చేయడం అశాస్త్రీయం.

సభ్యునిగా చేరేముందు మావో ఆలోచనావిధానంలో నమ్మకమున్నవాడై వుండాలనే షరతుపెట్టి మీరు విరసంను ఒక రహస్యసంస్థగా మార్చారు (Masonic Lodge). తమ నియమావళి ద్వారానే ప్రజల నుంచి, ప్రజాకీష్టం నుంచి తమను వేరుచేసుకొన్న మేధావులకే పరిమితమైన క్లబ్ అయిన విరసం వట్టి ఊహాత్మక (Utopian) సోషలిజంలోకి దిగజారుతుంది (దాని ఆకాంక్షలు ఎంత ఉన్నతమైనవి అయినప్పటికీ). సిద్ధాంత పరమైన ఈ విధానం శాస్త్రాన్ని ఒక పిడివాదంగా మారుస్తుంది, దీని వెంట అంతఃకలహాలు వుండడం సహజమే. అప్పుడు మీ అభిప్రాయానికీ (doxy), నా అభిప్రాయానికీ మధ్యన వివాదం వుండడం అనివార్యం.

ఫ్యూడల్ విధానం నుంచి దిగివచ్చిన హేతుపూర్వకం కాని కులం లాంటి వాటి ఆధారంగా ఏర్పడి ప్రజలపై అధికారాన్ని నెరపేందుకు బూర్జువాలకు పనికివస్తున్న (ప్రజలలోని) విభేదాలనూ- విస్తృత ప్రజానీకాన్నీ- ఏ రచయితల సంస్థయినా లెక్కలోకి తీసుకోవాలని నేను అనుకుంటున్నాను.

ప్రజాస్వామ్యంపేర స్థిరపరచబడి, పెంచబడుతున్న దుర్మార్గాలను బహిర్గతం చేసి రచయిత ప్రజలలోని ఈ విభేదాల తెరను చీల్చగలవాడై వుండాలి. ఇదికొన్ని కొట్టవచ్చినట్టు కనిపించే అన్యాయాలను తీసుకొని వాటిని బాగా బహిర్గతంచేయడం ద్వారా జరగాలి. పడికట్టు విప్లవ పదజాలం ద్వారాగాని, ఆనవాయితీగా మారిన విప్లవకవితా ప్రవాహం ద్వారా గాని ఇది జరగదు. దీనికి ఎంతో నిర్మాణాత్మక కృషి చేయవలసి వుంటుంది. పేదరైతాంగము, కార్మికుల స్థాయిల్లో అవినీతిని నిర్మూలిస్తేనే వాళ్ళలో రాజకీయ స్పృహ పెరుగుతుంది. పేదవానిలో అవినీతి వున్నదంటే దానికి సమాధానమున్నది కాని ధనవంతుల్లో అవినీతికి సమాధానమేమీ లేదనడంలో సందేహమేమీలేదు. కాని పరిస్థితులపట్ల మానసిక వైఖరి మారడానికి ఇది (అవినీతి) కారణమవుతుంది. రాజకీయ స్పృహ గురించి ఆలోచించినపుడు దీని ప్రభావం నష్టదాయకంగా వుంటుంది. ఒక ఓటరును ప్రలోభపెట్టినట్లే ఒక ట్రేడ్‌యూనియన్ నాయకుని కూడా ప్రలోభపెట్టవచ్చు. భేదం స్థాయిలోనే కాని అవినీతి విషయంలోకాదు. మార్క్ ట్వెయిన్ 'వెదర్' (వాతావరణం) లాగా ప్రతి ఒక్కరూ అవినీతి గురించి ఫిర్యాదు చేస్తారే తప్ప ఎవరూ దాని నిర్మూలనకోసం ఏమీచేయరు. ఎన్నికలలో అవినీతి నిర్మూలన కృషి అనేది ప్రజలలో రాజకీయ స్పృహను కలిగించడానికి కృషి కూడా అవుతుంది. అవినీతిని పేద రైతాంగమూ, కార్మికుల స్థాయి వరకు పోనిస్తే అది అర్థికవాదానికి దారితీస్తుంది. ఇదే దేశంలోని కార్మికుల, తెల్లబట్టల ఉద్యోగుల ట్రేడ్‌యూనియన్ కార్యకలాపాల్లో

ప్రతిబింబిస్తున్నది. ఒక రచయితల సంస్థ ఈ విషయాలన్నీ పరిశీలించి ఇట్లాంటి తక్షణ ప్రయోజనాలనాశించే దృక్పథాల నిష్ప్రయోజకత్వాన్ని బహిర్గతం చేయాలి.

దీనితోపాటు, పౌరహక్కుల ఉద్యమం నడపాలి. నా ఉద్దేశంలో పౌరహక్కులు అంటే మన రాజ్యాంగం ఒక సాధారణ పౌరునికోసం ప్రకటించిన హక్కులూ, వివిధ చట్టాల ద్వారా పౌరునికి కల్పింపబడిన రక్షణలూ, అని. ఇవీ, ఇటువంటివే అయిన ఆశయాలు మీ పరిధిని విస్తృత పరుస్తాయి. అప్పుడు ఎక్కువ మంది ప్రజలకు మీ రచయితల సంఘం ఆమోదయోగ్యం కాగలుగు తుందేమో. ఈ ప్రకారంగా మీరు అధిక సంఖ్యాక ప్రజలదాకా పోగలిగి కొంత ప్రయోజన కరమైన సేవచేయ గలుగుతారు. లేకుంటే, మూసిన గదుల్లో సిద్ధాంత పరమైన చర్చల్లోనే మీ సమయమంతా వెచ్చింప వలసి వస్తుం దని నాభయం.

సాయుధ విప్లవంలో నమ్మకం అనే మీ ఆశయమూ దాని పరిమితమైన పరిధీ ద్వారానే మిమ్మల్ని మీరు ప్రజలనుంచి దూరం చేసుకున్నారు. ఎమర్జెన్సీ ప్రకటించ గానే ఫ్రంట్ (సాయుధ విప్లవ పార్టీల అనుబంధ సంస్థఅని భావం) సంస్థగా ముద్ర పడింది. విరసం రచయితలుగా మీరు రహస్య జీవితం గడపలేక పోయారు. కాబట్టి మీరు జైళ్ళకు వెళ్ళవలసి వచ్చింది. కాబట్టి ఎమర్జెన్సీ కాలంలో విరసంను కూడా జైల్లోకి నెట్టడం జరిగింది. కొంత మంచిపని చేయవలసిన కాలంలో మీరు ఏ పనికీ రాకుండా పోయారు. ఎమర్జెన్సీ తర్వాత ప్రచురించబడ్డ జైలు అనుభవాలు, కొన్ని కవితలు అల్లడం మాత్రమే ఎమర్జెన్సీలో విరసం చేయగల్గింది.

లిబరల్ పార్టీలన్నీ అవినీతి రాజకీయ సంఘాలుగా మారి, సమానత్వ భావాలను వ్యాపార సరకుల్లా వాడుకొని అధికారంలోకి వస్తున్న దేశంలో ఒక రచయితల సంఘం ప్రజలలోకివెళ్ళి కొంత పనిచేసి ఆ పార్టీల నిజస్వరూపాన్ని బహిర్గతం చేయవలసిన అవసరమున్నది. మీ ఆశయాలను తిరిగి రూపొందించు కునేందుకు ఈక్రింది విషయాలను మీరు లెక్కలోకి తీసుకోవాలి (ఆశయాలను తిరిగి రూపొందించు కోవడం అవసరమనే అనుకొని నేను యిది రాస్తున్నాను.)

1) ఈదేశంలోని మేధావులకు ఆసక్తి, ఉత్సాహము లేవు. మానసిక సోమరితనం వల్ల ప్రజాస్వామ్యం గురించి కూడా వారికి సరియైన అవగాహన లేదు.

2) మేధావులంతా ఉద్యోగాల వెంటపడేవారు, ఉద్యోగాలు చేయడంలో అభిరుచి కలవారు. వాళ్ళ మానసిక పరిధి ఆ స్థాయిని దాటి పెరగదు. వాళ్ళు సుఖాలను అనుభ

తెచ్చుకొని స్వంతం చేసుకునే పద్ధతులను ప్రేమించేవారు. ఏ ప్రభుత్వం వాళ్ళకు ఈ సౌకర్యాలు కల్పిస్తే అది వాళ్ళకు మంచిది.

3) పట్టణాల్లోని కార్మిక వర్గం వేతనాలకై చేసే పోరాటాలతో అవినీతి పాలైంది. ట్రేడ్ యూనియనులు (అన్నీకాదు) కార్మిక వర్గాల్లో ఈ రకంఆర్థిక వాదాన్ని ప్రోత్స హించే జులాయి–కార్మిక నాయకులచే (లంపెన్ ప్రొలిటేరియట్) నడపబడుతున్నాయి. ట్రేడ్ యూనియన్ నాయకులు సాధారణంగా లాయర్లు చేసే పనులు చేయడానికి యిష్ట పడు తున్నారు. అంతేకాదు– ఈరకమైన పనితోనే పూర్తిగా తృప్తి పడుతున్నారు.

ముఖ్యంగా, ఒక రచయితల సంఘం ప్రస్తుత పరిస్థితుల్లో దేశంలోని వామ పక్ష ఉద్యమాన్ని నిష్పాక్షికంగా విమర్శించేదయి ఉండాలనీ, మార్క్సిజాన్ని లోతుగా అధ్యయనంచేసి అంతః కలహాలు తలఎత్తకుండ అరికట్టగలదయి వుండాలనీ, నేను అనుకుంటున్నాను. ఒక గ్రూపు సిద్ధాంతాన్ని అనుసరిస్తూ ఆ గ్రూపు క్రమశిక్షణకు కట్టుబడితే విరసం ఆ గ్రూపుసంస్థగా మారుతుంది. ఆ గ్రూపులో ఒక కలహం రాగానే విరసం విడిపోవడం అనివార్యం.

మీ ఆశయాలను తిరిగి రూపొందించు కునేపుడు పీటిపీ, మరికొన్ని అంశాలనూ మీరు దృష్టిలో వుంచుకోవాలి.

విరసం సభ్యుల అనుభవంతో పోలిస్తే నా అనుభవం పెద్దది కాదు కాబట్టి నా విమర్శ సమగ్రమైనది కాకపోవచ్చు. కాని ఈ అభిప్రాయాలను మీరు పరిశీలించాలని నేను అనుకుంటున్నాను. పూర్తి సమాచారంతో చర్చలో పాల్గొంటే సిద్ధాంతపర మైన విభేదాలలో పడక శాస్త్రీయ పద్ధతుల్లో భౌతిక పరిస్థితులను అంచనావేసి మీరు ఆశయాలను రూపొందించుకోగలరని నేను నమ్ముతున్నాను.

– కె. జి. కన్నబిరాన్

---

విరసం ఏర్పడిన ఈ ఎనిమిది సంవత్సరాలలో విరసం సభ్యులు, ఇతర విప్లవ రచయితలు, ప్రజాస్వామిక భావాలుగల రచయితలు చేసిన సృజనాత్మక రచనలపై, సాహిత్య, తాత్విక విమర్శలపై కూడ ప్రజాస్వామిక దృక్పథం గల పాఠకుల నుండి (విరసం సభ్యులు కానివారు మాత్రమే) సమగ్రమైన సమీక్షను, అభిప్రాయాలను ఈ చర్చావేదికలో భాగంగా ఆహ్వానిస్తున్నాం. ఇందులో సృజన నిర్వహించిన పాత్ర గురించి కూడ నిర్మొహమాటమైన అంచనా పాఠకుల నుంచి ఆశిస్తున్నాము.

### గి తెగాయింపు జెయ్యాలె-

గి సురుజెన వయిల మా కూలోల్ల "సంగెం" కత జదివినం- గజ్జదువ్వతాంటె నీవాంటనైతె పెయ్యంత ముండ్లచ్చినయ్- రోమాల్నిక్క బొడిశినయ్- పెయ్యంత బుగబుగ పొంగవట్టింది. ఇగ శేన్ల పంచాయిదంటె అందరికి యిష్పల్కాంగ, యిశ తర్రింగ తీర్తం జూడవోయినట్టుగ, గ కైకిలి గూలోల్లకున్న దొరలకు కైలాటకం గ గుండ్లల్ల పంచాయిదంటె మేంగూడ గాడికచ్చి, వో గుండెన్క నిలవడి గ ముచ్చట్లు ఇంటాసెట్టు గనిపిచ్చింది.

గంత దోకెబాజి, కుట్రబాజి దొరలు గసొంటి వున్నై లేనియ్ గల్పిచ్చి తోకతొటారం గ పోనోల్లె రాస్కచ్చిండ్లు- నీయవ! ఆకులు నాకెటోని మూతుల్నా కెటోల్లె గి దొరలు. మన్సంత కలికలైంది- అరికాల్లకెల్లి నెత్తికెక్కింది పోటు- ఒక్కపారే గిరంత రోతిరి, అన్నేయం అని గ గుంటనక్కల, తోడేల్ల గుండెల్ల గుబులు పుట్టెటట్టుగ బాగ మొత్తుకోవాల్ననిపిచ్చింది- గిదగిద వురకచ్చి గ యీరారెడ్డి, పెద్దిరెడ్డి మూతిపీసాలు (గవి బరాండిల నాని నిగనిగ మెర్తానట్టుగున్నయ్) రొండు శేతుల్ల పిరికిల్లనింద గట్టిగ వట్టుకోని కిందికిమీదిగ్గుదిచ్చి గ బూంపుండసొంటి గుంటలనూకేత్తె మంచిగుండనిపిచ్చింది. గని గంతెల్నె మరి లచ్చింమల్లన్న అదువరదస్క రూపాల కద్దిలేదు, బూవికి మునాఫా లేదన్నడని యెక్కడవడితక్కడ శెప్పినోడల్ల గ లొల్లిల యేమైందొ యేమొ గని గా తీస్కున్న నూర్రూపాలు అయిదు రూపాల్లు అద్దికి తీస్కున్నట్టు జెప్పిండు. గిక్కన్నె నాకు పానవంత అవిసిపోయి, నీరైపోయినట్టనిపిచ్చింది- గిదె నాకు దెల్వలె గట్లెందుకు జెప్పిండని.

యింకోటి- బొత్తయ్య జెప్పిన కతల కూలోడు పుల్లయ్య మల్ల కూలోల్లను దోపుకం జేశినట్టు శెప్పిండు- గిదిగూడ నాకు మంచిగన్పియ్యలె- గని ఎట్లయిన గిసొంటి కతలు రాసుటం శాన తక్కువనె. గిసోంటియి సద్వినా యిన్నా మల్లగలకు శెప్పెటట్టుగుంటయి. గసొంటి యాల్లల గి తెగాయింపు జెయ్యాల్ననిపిత్తది- అయినా అఖరుకచ్చెటాల్లకు పోలీసోల్ల దీసుకత్తె మనద్గెర జారిపోకుంట నిలవడేటోల్లెంతమందో సూడాలె గి కత రాశిన రాజన్నకు నా యిష్టవందనాలు. - రాయేశం, అయిందాలపెల్లి

లేఖ:

సృజన సంపాదకులకు-

మన మేధావులు తమ మేధస్సును ఎంతమాత్రం బాధపెట్టకుండా చిన్నప్పుడు చదువుకున్న పాఠాల్ని ఏకరువుపెట్టడం ఎవరికీ అంతగా ఉపయోగపడదు. సుదర్శనం గారి భావవాదాన్ని (సహేతుకంగానే) ఖండిస్తూ, "పదార్థం యొక్క ప్రభావం మనస్సు

మీద వుంటుంది గాని మనస్సు యొక్క ప్రభావం పదార్థంమీద ఉండదు- కాబట్టి పదార్థం మనస్సు ఒకదానిమీద ఒకటి పనిచేస్తున్నాయనడం అశాస్త్రీయం" అని జైరామ్ అంటున్నాడు.

ఇది ఎందుకు అశాస్త్రీయమో నాకు తెలియటం లేదు. దారే పొయ్యేవాణ్ణి ఆపి 'వెధవా!' అని తిట్టితే వాడి మనస్సుయొక్క ప్రభావం బుర్రమీదా, రక్త ప్రసరణంమీదా, హృదయ స్పందనంమీదా ఎలా ఉంటుందో చిన్న పిల్లలకు కూడా తెలుసు. ఇంతకన్న గంభీరమైన విషయం తీసుకున్నట్టయితే superstructure ప్రభావం base మీద ఉంటుందని మార్క్సిస్టులు ఎలా నమ్మగలుగుతున్నారు? ఏ మనస్సు ప్రభావమూ లేకుండానే ఎడారుల్లో తొలి నాగరికతలు వెలిశాయా! మానవ చరిత్రలో సామాజిక విప్లవ దశలన్నీ ముందు భౌతికంగా జరిగిపోయి, తరవాత మనస్సులు ప్రభావితా లయాయా?

"పదార్థానికీ చైతన్యానికీవున్న సంబంధం, వ్యత్యాసం పై రచయితకు శాస్త్రీయమైన అవగాహనలేదు. పదార్థానికీ, చైతన్యానికీ సంబంధమూ వుంది- వ్యత్యాసమూ వుంది. పదార్థం మనస్సుకు వెలుపలవున్న భౌతిక అస్తిత్వం. చైతన్యం ఆ పదార్థ అస్తిత్వంయొక్క ప్రతిబింబంతో మెదడు యొక్క పరిణామక్రమంలో ఉద్భవించిందే.

మెదడు యొక్క పరిణామక్రమమూ, బాహ్యపదార్థ అస్తిత్వం యొక్క ప్రతిబింబమూ కాక చైతన్యాన్ని నిర్ణయించేవి ఇంకేవీ లేవా? మెదడు యొక్క పరిణామదశ పరిణత మానవులు- Homo sapiens అందరిలోనూ ఒకేవిధంగా ఉంటుంది- ఒకే బాహ్య భౌతిక ప్రపంచాన్ని తమ మెదడులో ప్రతిబింబించుకున్న వారందరి చైతన్యమూ ఒకే రకంగా ఉంటుందా? అలా అయితే మార్క్సిస్టు సాహిత్యమంతా ఎందుకు? వర్గ పోరాటాలకు ఆధారం ఏమిటి?

చేతులు ఉపయోగించటం ద్వారా మనిషి మెదడు పెరిగిందని మార్క్సిస్టులతో బాటు బూర్జువా శాస్త్రవేత్తలు కూడా ఒప్పుకుంటున్నారు. మెదడు యొక్క పరిణామం ప్రభావం చైతన్యంమీదా, చైతన్యం ప్రభావం ఆచరణమీదా, ఆచరణ ప్రభావం తిరిగి చైతన్యంమీదా ఉంటుందన్నమాట స్పష్టం. పెట్టుబడిదారీ యుగపు భౌతిక స్వభావాల ఆధారంమీద గాని వర్గరహిత సమాజ భావాలు ఉత్పన్నం కావటం సాధ్యం కాలేదు. గతితార్కిక భౌతికవాదం ఆధారంమీద గాని వర్గ రాహిత్య కార్యక్రమానికి పునాది ఏర్పడదు.

మావో ప్రతి మార్క్సిస్టునూ 'అద్వైతం' (monism) సాధించమన్నాడు. మన మార్క్సిస్టులు కొంత భౌతికమనీ, మానవ జ్ఞానానుభూతులలో కొంత భౌతికం కాదని వాదించటం చిత్రంగా ఉన్నది.

— కొడవటిగంటి కుటుంబరావు

25-3-78

రిపోర్ట్:

## ఢిల్లీలో విరసంచే ఉప్పెన ఫోటోల పరిదర్శన

ఢిల్లీ విశ్వ విద్యాలయం ఆర్ట్స్ విభాగంలో మార్చి 16,17 తేదీల్లో ఉప్పెన బీభత్సాన్ని చూపే ఫోటోల ప్రదర్శనను ఆంధ్ర విప్లవ రచయితల సంఘం ఏర్పాటు చేసింది.

సుమారు 50 చార్ట్స్‌లో ప్రదర్శింప బడిన ఫోటోలు మూడు వందల పైగా మందిని ఆకర్షించాయి. పరిదర్శనా స్థలం ద్వారం దగ్గర బెర్టోల్ట్ బ్రెక్ట్ కవితను రాసి వుంచారు.

"మానవ మార్కెట్లలో
నేను చూసినదాన్ని చూపిస్తున్నాను
మానవత అమ్మబడడం నేను చూసాను"

ప్రకృతి వైపరీత్యం, ప్రభుత్వ వైఫల్యం, ప్రజల ప్రతిఘటన అనే మూడు అంశాలుగ ప్రదర్శనను విభజించారు. బ్రెక్ట్, నెరుడా, ఎరిచ్ ఫ్రెయిడ్, నజ్రుల్‌యిస్లాం అమర్‌జిత్ చందన్, కె. వి. రమణారెడ్డి, నగ్నముని, నిఖిలేశ్వర్, చెరబండరాజు, వరవరరావు రాసిన కవితల్లోని పంక్తులను ఏరి ఫోటోల క్రింద రాసారు. ఎడ్వర్డ్ మెర్క్యూ మాటలను పరిదర్శన చివర రాసివుంచారు.
కొల్లగొట్టబడి, చెరచబడి, తుడిచివేయబడి ఈ భీతావహ స్థితిలోంచి మానవత తన నిరసన తెలపడానికి రాస్తున్నది....

నిరసన– ఈ నిరసనయే ఒక భవిష్యదాశా సూచన.

ఈ ప్రదర్శన ఢిల్లీ విశ్వ విద్యాలయంలో మరికొన్ని కళాశాలల్లో కూడ ఏర్పాటు చేయ బడింది.

ఈ ప్రదర్శనను చూసి ప్రేక్షకులు రాసిన అభిప్రాయాల్లో ఒకటి, రెండు:

"నేను నాహృదయాన్ని మాటల్లో పెట్టలేక పోతున్నాను. కదిలించే పరిదర్శన సరియైన దృక్పథంతోవుంది. చాలామంది మిత్రులు నా ఈ భావాలనే పంచుకుంటారని ఆశిస్తున్నాను. నిర్వాహకులు అభినంద నీయులు "(డా. మనోరంజన్ మొహంతి, చైనీస్ డిపార్ట్‌మెంట్, ఢిల్లీ విశ్వవిద్యాలయం 'రెవల్యూషనరీ వాయిలెన్స్ ఇన్ ఇండియా' గ్రంథకర్త)

"ప్రకృతి సంక్షోభం వచ్చిన ఉప్పెనను స్వార్థానికి వాడుకొన్న వాళ్ళందరినీ తుడిచిపెట్టి, అన్నిరకాల బానిసత్వానికి గురికాబడ్డ వాళ్ళను విముక్తం చేసే ఉప్పెన వచ్చేరోజు కోసం కృషి చేసేందుకు గాను మనల్ని కదిలిస్తుంది– ఈప్రదర్శన" (డా. అరవిందఘోష్, అకడమిక్‌కౌన్సిల్ సభ్యుడు, ఢిల్లీ విశ్వవిద్యాలయం. ఢిల్లీ పియుసిఎల్ ప్రముఖ కార్యకర్త–)

SṚJANA Telugu Monthly April/May 78 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67

## విరసం సభల సందర్భంలో వెలువడిన పుస్తకాలు

విరసం ప్రచురణ :

1. పోరాటాల శ్రీరాములు (పరిటాల శ్రీరాములు రచనలు) 0–75

సృజన ప్రచురణలు:

2. భూమి భాగోతం (నృత్య నాటకం) వంగపండు ప్రసాదరావు 1–00
3. ప్రపంచ చరిత్ర ఎందుకు చదవాలి? (చరిత్ర పాఠాలు) 0–40

యుగ ప్రచురణలు;

4. జననం - కవితలు నర్సింగరావు
5. స్వేచ్ఛ - జెయిలు కవితలు వరవరరావు 2–50

ప్రతులకు : సృజన
హనుమకొండ
వరంగల్ 506 001

## మా పల్లె

(చెరబండరాజు నవల)

వెలువడింది. వెల రూ. 4–00

ప్రతులకు :

1. చెరబండరాజు
2-2-899, అంబర్‌పేట
హైదరాబాదు - 13
2. సృజన
హనుమకొండ
వరంగల్ - 506 001